ప్రథమ

# ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ



# నిబంధనావళి
# రిపోర్టు - తీర్మానాలు



చిలువూరు

**15, 16 - ఫిబ్రవరి 1947**

# విషయ సూచిక

# ఉపోద్ఘాతం

ఆంధ్రదేశ మహిళాలోకాన్ని తన శక్తినంతా వినియోగపర్చి మేల్కొల్పినది శ్రీవీరేశలింగం పంతులుగారు. ఆనాడు వేల సంవత్సరాలుగా సంఘ దురాచారాలకు గురియై మ్రగ్గి పోతున్న స్త్రీలకు విద్య కావాలనీ, సంఘ సమానత్వం కావాలనీ, వితంతు వివాహాలు అత్యవసరమనీ సారస్వతం ద్వారా ఆచరణద్వారా ఆంధ్ర లోకానికి చాటారు. ఆనాటి ఉద్యమం ఎక్కువగా సాంఘిక సమస్యలమీద కేంద్రీకరించ బడినది. 1921 లో గాంధీ మహాత్ముని స్వాతంత్ర్య ఉద్యమ ప్రభావంచేత మనదేశ స్త్రీలు రాజకీయంగా ఆలోచించ ప్రారంభించారు. 1930-31 వ సం॥లో జరిగిన సహాయ నిరాకరణోద్యమంలో నడుముగట్టి దేశస్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. వందలాది స్త్రీలు జైళ్ళకు వెళ్ళారు. ఎండనక వాననక విదేశవస్తు బహిష్కరణ అమలులో పెట్టించుటకై షాపులముందు పికెట్ చేసారు. బ్రిటిష్ సామ్రాజ్యవాద పోలీసులు రంగునీళ్లు కొట్టినా, దూరంగా తీసుకుపోయి ఒంటరిగా వదలిపెట్టినా, వెనుదిరగకుండా ధైర్యంగా నిల్చారు ఆనాడు యీ ఉద్యమాల్లో పాల్గొన్నది ముఖ్యంగా పట్టణ మధ్య తరగతి స్త్రీలు, రైతు స్త్రీలు. యీ పై వారసత్వాన్ని ఈనాటి స్త్రీలు పెంపొందించి ముందుకు నడుస్తున్నారు. రాష్ట్రంలో మనం మొట్టమొదటి సారిగా పల్లెటూళ్ళలో అన్ని వర్గాల స్త్రీలను కలిపి నిర్మాణ యుతమైన మహిళా ఉద్యమానికి పునాదులు వేశాము.



# ని బం ధ న లు

## సెక్షను 1 : (అ) పేరు

ఈసంఘము ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘము అని పిలువబడును.

షరా :—ఈ సంఘము ఆంధ్ర స్త్రీలయొక్క ప్రజాసంస్థ.

## కార్యస్థానము : (ఆ)

ఈ సంఘంయొక్క కార్యస్థానము కృష్ణాజిల్లా బెజవాడలో యుండును.

## సెక్షను 2 : ఆశయము

1. ఆర్థిక, రాజకీయ, సాంఘిక హక్కులు స్త్రీలకు పురుషులతో పాటు, సంపాదించుటకై కృషిచేయుట.

2. స్త్రీలలో విజ్ఞానాభివృద్ధి, సంఘసేవ, సంస్కరణాభిలాష మున్నగువాటిని ప్రోత్సహించుట.

3. భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యము సంపాదించుటకై ప్రజాతంత్ర సంస్థలతోను, జాతీయోద్యమముతోను కలసి భారతదేశములో సర్వరాజకీయ, ఆర్థికహక్కులు ప్రజల హస్తగతమై యుండే ప్రజా స్వామిక ప్రభుత్వాన్ని స్థాపించుట యీసంఘముయొక్క ఆశయము.

## సెక్షను 3 : కార్యక్రమము

సంఘముయొక్క ఈ ఆశయాన్ని సఫలీకృతం చేయటానికిగాను, స్త్రీలను వారి అత్యవసర కోర్కెలపై మహిళాసంఘాలలో సంఘటిత మొనర్చి వారి దైనందిన పోరాటాలను సాగించుతూ, స్వాతంత్ర్యసిద్ధి కొరకు ఇతర జాతీయశక్తులతో పనిచేయుచుండును.

## సెక్షన్ 4 : నిర్మాణము.

ఈ సంఘము యీ క్రింది సంఘములతో కూడి యుండును :—

1. గ్రామ మహిళాసంఘాలు, వాటి కార్యనిర్వాహక వర్గములు.
2. తాలూకా మహిళా సంఘాలు, వాటి కార్యనిర్వాహక వర్గములు.
3. జిల్లా మహిళాసంఘాలు, వాటి కార్యనిర్వాహక వర్గములు.
4. రాష్ట్ర మహిళాసంఘసాధారణసంఘం, దానికార్యనిర్వాహకవర్గం
5. రాష్ట్ర మహిళాసభయొక్క ప్రతినిధుల సమావేశం.

## సెక్షన్ 5 : సభ్యత్వం.

(అ) కనీసం 18 సం॥ వయస్సు కలిగియుండి సంఘ ఆశయములను అంగీకరించి, సంఘ క్రమశిక్షణకు బద్ధురాలవటానికి తయారై నిర్ణీత సభ్యత్వపారములో దరఖాస్తుచేసి సాలుకు ఒకఅణా సభ్యత్వ రుసుము చెల్లించిన ఏవర్గ స్త్రీయైనా సంఘ సభ్యురాలగును.

(ఆ) మహిళా సంఘములో పనిచేయగోరి క్లాజు (అ) ప్రకారం సభ్యత్వమునకై దరఖాస్తుచేసిన ఏస్త్రీనైనా గ్రామ మహిళాసంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యురాలినిగా చేర్చుకోవచ్చును.

(ఇ) ఏవ్యక్తియైనా ఏదో ఒక గ్రామ మహిళాసంఘంలో సభ్యురాలుగా చేరాలిగాని ఎక్కువ గ్రామ సంఘాలలో చేరరాదు.

(ఈ) ఈ సంఘము నిర్ణయించిన గడువులోగా సాలుసరి చందా చెల్లించని ఏసభ్యురాలైననూ ఎన్నికలలో పాల్గొనుటకుగాని, ఈ సంఘ మందలి ఏఎన్నిక పదవులకైనా నిలబడుటకుగాని అర్హురాలుగాదు.

(ఉ) సర్వసాధారణంగా సంఘ సంవత్సరము మార్చి 1 వ తేదీతో ప్రారంభమై, ఫిబ్రవరి 1 తో అంతమగును. ప్రతిసభ్యురాలు సభ్యత్వరుసుమును మార్చి ఒకటవ తేదీనుండి చెల్లించవలసి యుంటుంది.

## సెక్షన్ 6 : గ్రామ మహిళా సంఘము

గ్రామమందలి మహిళాసంఘ సభ్యులందరూ తమ సంఘములో సాధారణ సభ్యులగుదురు. సాధారణసంఘం వార్షిక సమావేశంలో

ఒక అధ్యక్షురాలు, ఒక కార్యదర్శిని. మరి ముగ్గురు సభ్యురాండ్రునుగల ఒక కార్యవర్గం ఎన్నుకోబడుతుంది.

షరా: 5 సభ్యత్వంగల గ్రామం గ్రామసంఘాన్ని ఏర్పరచవచ్చు.

పై సంఘ నిర్ణయాలను, దైనందిన కార్యక్రమమును అమలుపరచుటకై మహిళలందరినీ సమీకరించుట గ్రామ మహిళాసంఘాల కర్తవ్యం.

## సెక్షన్ 7: తాలూకా మహిళాసంఘం

500 మంది సభ్యత్వంగల ప్రతితాలూకా లోనూ తాలూకా మహిళా సంఘాన్ని ఏర్పరచవచ్చు.

(అ) జిల్లా మహిళాసంఘమునకు లోబడి, తాలూకాలోగల గ్రామ మహిళాసంఘాలను చురుకుగా పనిచేయించుచు మహిళల దైనందిన సమస్యలను ఇతరసమస్యలను పరిష్కరించుటకు కృషిచేస్తూ సంఘాభివృద్ధికి తోడ్పడుతుంది,

(ఆ) గ్రామ మహిళాసంఘ కార్యవర్గ సభ్యులందరూ దాని సాధారణ సభ్యులుగా ఉంటారు.

## సెక్షన్ 8: జిల్లా మహిళాసంఘం

(అ) కనీసం 3 గ్రామసంఘాలైనా ఏర్పడిన జిల్లాలో జిల్లాసంఘము ఏర్పడుతుంది.

(ఆ) గ్రామ మహిళాసంఘంచే రాష్ట్ర మహాసభకు ఎన్నుకోబడిన ప్రైమరీ డెలిగేట్లు జిల్లా సాధారణసంఘ సభ్యులగుదురు.

(ఇ) జిల్లా మహిళాసంఘము దాని వీలునుబట్టి ప్రతి సంవత్సరం వార్షిక మహాసభలను, ర్యాలీలను ఏర్పాటుచేయును.

(ఈ) జిల్లా సాధారణసంఘ సభ్యులు సమావేశమై వారిలో నుంచి, 15కి మించని సభ్యురాండ్రను ఎన్నుకోవాలి.

(ఉ) గ్రామసంఘాలు, తాలూకా సంఘాలు బాగా పనిచేసే టట్లుగా చూడటం, సంఘ కార్యక్రమమును, విధానమును సరిగా నెరవేర్చడం, స్త్రీల దైనందిన సమస్యల పరిష్కారానికి కృషిచేయటం, జిల్లా మహిళా సంఘ బాధ్యతలు.

(ఈ) రాష్ట్రీ మహిళా సంఘముయొక్క ఆమోదమునకు లోబడి, జిల్లా మహిళా సంఘాలు, తమ తమ నిబంధనలను తయారు చేసుకోవచ్చును.

## సెక్షన్ 9 : రాష్ట్రీ మహిళా సంఘము

రాష్ట్రీ మహిళా మహాసభలో, ప్రైమరీ డెలిగేట్లనుండి అధ్యక్షురాలు, ఒక కార్యదర్శిని, ఇద్దరు సహాయ కార్యదర్శినులు, 14 మంది సభ్యులుగల కార్యవర్గము ఎన్నుకోబడుతుంది.

## సెక్షన్ 10 : ప్రాతినిధ్యం

(అ) ప్రతిగ్రామ మహిళా సంఘము, 50 మంది సభ్యురాండ్ర కొకరు చొ. నన్నూ, అంతకుపైన 20కి మించిన శేషమునకు ఇంకొక ప్రైమరీ డెలిగేటున్నూ, 50 సభ్యురాండ్రకు లోపునవున్న గ్రామ మహిళాసంఘము ఒక ప్రైమరీడెలిగేటు చొ. రాష్ట్రీ మహాసభకు పంపవచ్చును.

## సెక్షన్ 11 : ప్రైమరీ డెలిగేట్ల ఎన్నికలు

(అ) ప్రతి గ్రామ మహిళా సంఘము, రాష్ట్రీ మహాసభకు తన వంతు డెలిగేట్లను ఎన్నుకొంటుంది.

(ఆ) రాష్ట్రీ మహాసభకు, 15 రోజులు ముందుగా ప్రైమరీ డెలిగేట్ల ఎన్నిక జరుగుతుంది

(ఇ) గ్రామ మహిళా సంఘము, ఈ ఎన్నికలకు కనీసం 7 రోజులు ముందుగా తన సభ్యులందరికీ నోటీసు లివ్వాల.

## సెక్షను 12 : రాజకీయతీర్మానము

రాష్ట్ర మహిళామహాసభలో చర్చకు వచ్చే విషయాలు అధికసంఖ్యాకుల ఓటుచే ప్యాసుకాబడును. కాని, జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలకు సంబంధించిన విషయాలు నాల్గింట మూడువంతుల ఓట్లచే ప్యాసుకాబడాలి.

## సెక్షను 13 : సాధారణసంఘము

(అ) రాష్ట్రమహాసభకు వచ్చిన ప్రయిమరీ డెలిగేట్లనుండి 100 మంది జనరల్‌బాడీ సంఘ సభ్యురాండ్రుగా ఎన్నుకోబడుదురు.

(ఆ) ప్రతిసాధారణసంఘసభ్యురాలు సంవత్సరమునకు రు1–0–0చందా చెల్లించవలెను. సంవత్సరమున కొకసారైనా సాధారణసంఘం సమావేశంకావాలి. సంఘనివేదికలు, జమాఖర్చులు, కార్యదర్శిచే ప్రవేశపెట్టబడే విషయాలు ఇంకా సాధారణ సంఘం అవసరమని తలచే విషయములు చర్చించబడును.

(ఇ) నూతన సాధారణసంఘ సభ్యుల సమావేశం జరిగేవరకు లోగడ ఎన్నుకోబడిన సంఘమే సర్వాధికారాలు కలిగియుండును.

(ఈ) గత సంవత్సరమున్న అధ్యక్షురాలు తన సభ్యత్వమును పునరుద్ధరించుకొనినచో అధికారరీత్యా సాధారణసంఘసభ్యురాలగును.

## సెక్షను 14: కార్యనిర్వాహకవిధులు

(అ) ఈకార్యనిర్వాహకవర్గము, సంఘముయొక్క ఎగ్జిక్యూటివ్‌గా ఉండును. అవసరాన్నిబట్టి ఉపసంఘములను నియమించుటకును, తమకున్న అధికారములను, బాధ్యతలను వారికొసంగుటకును కార్యనిర్వాహకవర్గానికి అధికారముగలదు.

(ఆ) నూతన కార్యనిర్వాహకవర్గము ఏర్పడేటంతవరకు లోగడ ఎన్నుకోబడిన కార్యనిర్వాహక వర్గమే పనిచేస్తుంది కార్యనిర్వాహక వర్గంలో వచ్చే ఖాళీను సాధారణసంఘం అంగీకారానికి లోబడి భర్తీచేసుకోవచ్చును.

(ఇ) కార్యనిర్వాహకవర్గం సాధారణసంఘం అనుమతికిలోబడి నిబంధనావళిని స్పష్టీకరించవచ్చు. కార్యవర్గం సలహాలు యివ్వవచ్చు. కార్యవిధానమును అమలుచేయవచ్చును.

(ఈ) కార్యనిర్వాహక సభ్యురాండ్రయొక్కగాని, అధ్యక్షురాలియొక్కగాని రాజీనామాను కార్యవర్గము అంగీకరించాలి.

(ఉ) సంఘ అభివృద్ధిని కోరే ఏ వ్యక్తినైనా కార్యనిర్వాహకవర్గ సమావేశమునకు ఆహ్వానించవచ్చును. కార్యనిర్వాహకవర్గమునకు సలహాలు ఇవ్వవచ్చు. కానిఅట్టివారికి ఓటింగుహక్కుఉండదు.

## సెక్షను 15: కార్యకర్తల విధులు

అధ్యక్షురాలు :— ప్రతివిధుల వార్షిక సమావేశమునకు, సాధారణ సంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశములకు అధ్యక్షతవహించును. కార్య

వర్గముచే నియమింపబడిన అన్ని వుపసంఘములకును అధ్యక్షురాలిగా నుండును. సాధారణసంఘ కార్యనిర్వాహక సమావేశములను పిలువ వచ్చును.

ప్రధాన కార్యదర్శిని :— సంఘకార్యాలయ నిర్వహణలోను, ఆస్తి విషయంలోను పూర్తిబాధ్యతవహించి, కార్యాలయ వ్యవహారముల నిర్వహింపవలెను. తనకుతానుగాని అధ్యక్షురాలి సలహాపైగాని, సాధారణసంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశములను సమావేశపరచవచ్చును. అధ్యక్షురాలి అంగీకారంతో ఆఫీసు సిబ్బందిని నియమించవచ్చును. తర్వాత కార్యనిర్వాహకవర్గ అనుమతిని పొందాలి.

సాధారణ సంఘ కార్యనిర్వాహకవర్గ వార్షిక సమావేశములలో, జమాఖర్చులు ప్రవేశ పెట్టాలి.

కార్యనిర్వాహక వర్గముచే నియమించబడిన, ప్రతి ఉపసంఘము లోను, అధికారేతర సభ్యురాలుగా వుండును.

సహాయ కార్యదర్శినులు :— కార్యనిర్వాహక వర్గం తనకిచ్చిన బాధ్యతలు నిర్వహిస్తూ, ప్రధానకార్య దర్శినికి సహాయ పడుచుండ వలెను.

## సెక్షన్ 16 : సమావేశములు

సాధారణసంఘ సమావేశములకు 15 రోజులు, కార్యనిర్వాహక వర్గ సమావేశములకు 10 రోజుల వ్యవధితో, నోటీసులు పంప వలెను. అవసర విషయాలను, లేక అత్యవుసరవిషయాలను చర్చించటానికి, సాధారణ సంఘాన్ని 7 రోజులు, కార్య నిర్వహక వర్గాన్ని 3 రోజులు వ్యవధితో అధ్యక్షురాలు లేక ప్రధాన కార్యదర్శిని సమావేశ పరచవచ్చును. సాధారణ సంఘానికి 15 మంది కార్యనిర్వాహక, వర్గానికి 5 మంది, (కోరం) కనీసం హాజరు గావాలి.

## సెక్షను 17 : క్రమశిక్షణ

(అ) సంఘముయొక్క, ఆశయాలకు, కార్యక్రమానికి విరుద్ధంగా నడుస్తూ గాని, దొంగ సభ్యత్వం చేర్పించిగాని, ఇంకా ఏచర్య మూలంగా నైనా సంఘ ప్రతిష్ఠను పాడుచేసి, విచ్ఛిన్నానికి దారి తీసేటట్టు చేసిన సభ్యురాలుగాని, సంఘంగాని, క్రమశిక్షణ చర్యకు

బాధ్యు లవుతారు. అట్టి సభ్యురాలిని అధికార పదవినుండి తొలంగించటం గాని, సభ్యత్వమునే రద్దు చేయడము గాని, జరుగును. ఒకసంఘం అట్టిచర్య చేసినపుడు, దానిని సస్పెండు చేయడము గాని, అనుబంధం రద్దు చేయడం గాని జరుగుతుంది.

(ఆ) ఇట్టి క్రమశిక్షణ చర్య రాష్ట్ర కార్యవర్గము మాత్రమే తీసికొంటుంది. ఏఇతర శాఖకు ఇట్టిచర్య తీసుకొనే అధికారము లేదు. రాష్ట్ర సంఘానికిసిఫారసు చేయవచ్చును.

## సెక్షను 18 : ఆఫీసు - సంఘనిధి వగైరా

(అ) అధీనసంఘాలు : గ్రామ-తాలూకా-జిల్లాసంఘాలకు ప్రత్యేక ఆఫీసు ఉండాలి. ఆఫీసురిజిస్టరులను, జమాఖర్చులనుసక్రమంగావుంచాలి. పైసంఘాలు వీటినెప్పుడైనా తనిఖీ చేయవచ్చు. పైబాధ్యతలను నిర్వహించకుండా ఉండే ఉద్యోగబృందం క్రమశిక్షణకు బాధ్యులవుతారు, సభ్యత్వ రుసుములో గ్రామానికి 0-0-3; తాలూకాకు 0-0-3; జిల్లాసంఘాలకు 0-0-3; రాష్ట్రసంఘానికి 0-0-3 చెందాలి.

(ఆ) సంఘ జమాఖర్చులను ప్రధానకార్యదర్శిని వార్షిక సమావేశము నందుంచాలి. సభ దానిని చర్చించి ప్యాసుచేయవచ్చు. చేయకపోవచ్చు. లేదా తమఇష్ట మొచ్చిన అధికారమునిచ్చి (జమాఖర్చులు తనిఖీ చేయటానికి ఒకఉప సంఘాన్ని నియమించవచ్చు.) అధీన సంఘాల విషయంలోగూడా ఇదేవిధమైన కార్యవిధానము అవలంబించబడును.

(ఇ) సంఘనిధి నంతటినీ సంఘఆశయ సాధనకై వినియోగించ వలెను. సంఘనిధినుండి అలవెన్సులు కార్యకర్తలు తీసుకొనుటకు కార్య నిర్వాహకవర్గము అంగీకరించాలి.

(ఈ) 100 రూపాయలకు మించిన సంఘధనాన్ని అధ్యక్ష కార్యదర్శులల ఇద్దరిపేరా ఒక బ్యాంకులో నిల్వచేయాలి. బ్యాంకునుండి డబ్బు తీయవలసి వచ్చినపుడు బ్యాంకుడ్రాఫ్టుమీద ఇద్దరిసంతకాలూ ఉండాలి.

(ఉ) ప్రతినెలా 100 రూపాయలకు మించకుండా సంఘవ్యవహారములకు, సంఘఆశయములకు విరుద్ధం కానటువంటి కరపత్రములు

వగైరా ప్రకటించుటకు కార్యదర్శినికి అధికారముండును. ఈ ఖర్చులు కార్యనిర్వాహకవర్గంచే ఆమోదించబడాలి.

(ఊ) కార్యవర్గము అంగీకరించిన ఖర్చులు తప్ప ఇతరంగా సంఘం సొత్తువాడునపుడు, వ్యవహరించినపుడు కలిగిన నష్టమునకు కార్యవర్గం బాధ్యత వహించదు.

## సెక్షను 19 : జెండా

తెల్లగుడ్డపై చుట్టూ ఎఱ్ఱబోర్డరుకలిగి, మధ్యఎఱ్ఱరంగుతో ఐదుకోణములతో నక్షత్రము, "స్వాతంత్ర్యము, శాంతి, అభ్యుదయము" కలిగిన చిహ్నలు కళిగియుండును.

## సెక్షను 20 : విస్తీర్ణము

విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలు రాష్ట్రమండలి సంస్థానములలోని తెలుగుప్రాంతముల స్త్రీల అభివృద్ధికొరకు ఈ సంఘం పాటుబడుతుంది.

## సెక్షను 21 : నిబంధనావళిలో మార్పులు

(అ) నిబంధనావళిలో మార్పులు కోరువారు వార్షికమహాసభకు 3 నెలలు ముందుగా నోటీసులివ్వాలి.

(ఆ) వార్షికమహాసభ నిబంధనావళిలో మార్పులు సూచించటానికి ఒక ఉపసంఘాన్ని నియమించి సాధారణసంఘానికి ఆ సూచనలను ఆమోదించటానికిగాని, త్రోసివెయ్యటానికిగాని, క్రొత్తవి చేర్చటానికిగాని, అధికారము ఇవ్వవచ్చును.



# భారతదేశ స్త్రీల హక్కుల, విధుల ప్రణాళిక

## 1946 జులైలో కలకత్తాలో జరిగిన అఖిలభారత మహిళాసభ స్థాయి సంఘంవారిచే అంగీకరించ బడిన ప్రణాళిక

(కొద్ది సవరణలతో ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభలో ఇది అంగీకరించ బడింది)

మానవ జాతి అభివృద్ధికి; స్వాతంత్ర్యం; సమానత్వం చాల అవసరమని, స్త్రీ పురుషులు సమానము అని, స్త్రీ కూడ పురుషునితోపాటు సమాన పాత్ర నిర్వహించాలని నమ్ముచున్నాం. స్త్రీ పురుషుల యొక్క అభివృద్ధి మీద, వారు తమ పూర్తి బాధ్యతలను గుర్తెరిగి నిర్వర్తించుట మీదనే సమాజాభివృద్ధి ఆధారపడి వుందని నమ్ముచున్నాము.

స్వాతంత్ర్య సౌభాగ్యాలతో తులతూగే సమాజాన్ని నిర్మించుటలో స్త్రీ చాల ప్రధాన బాధ్యత నిర్వహించ వలసి యుంది. అపనిని ఆమె స్వతంత్రం కలిగి బాధ్యతగల వ్యక్తిగా నున్నపుడే నిర్వహించ గలదు.

ప్రస్తుత దేశంలో స్త్రీల పరిస్థితి చాల అసంతృప్తి కరంగా వుంది. దీనికి ముఖ్యకారణం దేశం చాల అధోగతిలో నుండుటయే నని నమ్ముచున్నాము.

కనుక మేము స్త్రీని కూడ పురుషునితో పాటు సమాన స్థాయికి తీసుకు రావడం అవసరమని, అప్పుడే దేశంయొక్క ప్రపంచంయొక్క జీవిత పునర్నిర్మాణంలో స్త్రీ తన సముచిత పాత్రను నిర్వర్తించ గలదని నమ్ముతున్నాము.

ఈ దృష్టితోనే మేము వ్యక్తిగతంగాను, భావి శాసనాలకు ప్రాతిపదికగాను వుండునట్లు సమాజంలో ఒక సభ్యురాలు గాను, భారత స్త్రీ హక్కులను గూర్చి యీక్రింది హక్కుల ప్రణాళికను తయారు చేశాం.

## 1. ప్రాథమిక హక్కులు

ప్రజాస్వామిక సమాజములో ప్రతివ్యక్తికి మానవ సామానత్వ సిద్ధాంతంమీద ఆధారపడ్డ ప్రాథమిక హక్కుల ననుసరించడానికి

అర్హతవుంది. కాని హిందూదేశములోని స్త్రీలకు అందులో కొన్ని హక్కులు నిరాకరించబడినవి. కనుక జాతి, మత, స్త్రీ, పురుష భేదం లేకుండా వ్యక్తులందరూ న్యాయదృష్టిలో సమానులు, ఉద్యోగాలలోగాని వ్యాపార వృత్తుల విషయంలోగాని జాతి, మత స్త్రీ పురుష భేదం చూప కూడదు.

1. ప్రస్తుతం వోటింగు పద్ధతి చాల సంకుచితంగా వుండటంవలన వోటు హక్కుగల స్త్రీ పురుషుల సంఖ్య చాల తక్కువగావుంది. అందులోనూ స్త్రీలసంఖ్య మరీ తక్కువగావుంది. ఇది మాకు అంగీకారం కాదు. ఆస్థిపాస్థులుగల వోటర్ల భార్యలుగావున్న స్త్రీలకు వోటింగుహక్కు కల్పించే పద్ధతిని ఏమాత్రం అంగీక రించము.

2. 21 సంవత్సరము నిండిన ప్రతి స్త్రీకి పురుషునికి వోటింగుహక్కు కల్పించి అన్ని శాసనసభలకు స్త్రీకి ఎన్నుకొనబడే హక్కు కల్పిం చాలనీ, అంతరంగిక వ్యవహారాలకోసం, విదేశ వ్యవహారాలకోసం ఏర్పరచే కమిటీలలో స్త్రీకికూడ ప్రాతినిధ్యం వహించే హక్కు కల్పించాలని కోరుతున్నాము.

(ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభలో వోటుపొందే వయస్సు 21 సంవత్సరములు కాకుండా 18 సంవత్సరములు వుండవలెనని తీర్మా నించబడెను.

3. శాసనసభల, స్థానిక సంస్థల ఎన్నికలలో నిలబడుటకు స్త్రీల కధికార ముండవలెనని కోరుచున్నాము.

## 2. విద్యా విధానము

చదువులేనిదే యే వ్యక్తిగాని, సంఘముగాని పురోగమించడం కష్టం. విద్య హిందూదేశములోని స్త్రీలకు పురుషులకు నిరాకరించబడి నది. నూటికి 13 గ్గురు మాత్రమే చదువుకొనినవారున్నారు. అందులో స్త్రీలు నూటికి ఇద్దరుమాత్రమే. ఇప్పుడు నేర్పబడే విద్యకూడ లోపభూయిష్టంగా వుండి మన ప్రజల శారీరక, మానసిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక అభి వృద్ధికి సహాయపడడంలేదు. కాబట్టి ఈ క్రింది కోర్కెలను కోరు తున్నాము.

1. ప్రస్తుత విద్యావిధానాన్ని మార్చవలెనని దేశపరిస్థితులకు, అవసరాలకు అనుగుణ్యంగానూ తన విద్యావిధానమును ప్రవేశపెట్ట వలెనని కోరుచున్నాము.

2. స్త్రీ పురుషులు నెరవేర్చవలసిన పౌరసత్వపు విధులు ఒకటే కనుక వారి విద్యావిధానములో భేదముండకూడదు.

3. ప్రైమరీ, సెకండరీ, యూనివర్సిటీవిద్య, సాంకేతిక విద్య, వయోజన విద్య, విద్యావిధానములో ప్రాధాన్యత వహించాలి మాతృభాషలోనే విద్యను గరపాలి.

4. ప్రతిబాలునికి బాలికకు ఏడు సం॥లనుండి 14 సం॥ల వయస్సు వరకు 7 ఏళ్ళ పాటు నిర్బంధ ప్రాథమిక విద్యవుచితంగా నేర్పబడాలి.

5. ఉపాధ్యాయులు, భవనములు మొదలగు విద్యావసరాలు కొరతగానున్నందున స్త్రీ పురుషులకు కలిపియే స్కూళ్లుండాలి. హైస్కూలు విద్య వేరువేరుగా గరుప బడాలి.

6. ఆడపిల్లల విద్యకు అంతరాయమును కల్గించుచున్న బాల్య వివాహము, పరదా, అంటరానితనము చిన్న పిల్లలతో పనిచేయించుట మొదలగు సంఘదురాచారములను తీసివేస్తూ ప్రభుత్వము చట్టము చేయాలి.

7. ఆర్థిక కారణాలవల్ల పిల్లలను బడికి పంపడానికి యిష్టంలేని తల్లిదండ్రులకు తగిన ఆర్థిక సహాయంచేసి పిల్లలకు స్కాలరుషిప్పులిచ్చి సహాయం చేయాలి.

8. నిర్బంధ ప్రాథమిక విద్యాకాలం పూర్తియైన తరువాత తెలివితేటలు గనబరచే పిల్లలకు ప్రభుత్వం స్కాలరుషిప్పులు పుస్తకాలు మొదలైనవి యిచ్చి వున్నత విద్యను నేర్చు కొనుటలో సహాయం చేయాలి.

9. ఆరోగ్యమున కవసరమగు ఆటలుకూడ విద్యా విధానములో ఒక భాగముగ చేర్చవలెను.

10. అందరికి అందుబాటులో నుండునట్లు సెకండరీ స్కూళ్ళసంఖ్యను హెచ్చించాలి.

11. స్త్రీలకుకూడ సాంకేతిక విద్యగరపుటకు పోలీటెక్నికల్ స్కూళ్ళు తెరువవలెను.
12. విశ్వవిద్యాలయములను స్త్రీ పురుషుల కందుబాటులో వుండుటకు ప్రాదేశిక విశ్వవిద్యాలయములను తెరువ వలెను.
13. విశ్వవిద్యాలయములందు లలితకళలు, సంగీతం, గృహనిర్వహణ, శాస్త్రం మొదలగు విద్యలు నేర్పవలెను.
14. స్త్రీలకు వున్నతవిద్య నభ్యసించుటకుగాను అవకాశముండుటకు ప్రత్యేకమైన హాస్టళ్ళు తెరువవలెను.
15. హెచ్చుమంది వుపాధ్యాయినులను తయారుచేయుటకు స్కాలరు షిప్పులు యిచ్చి స్త్రీలకు ప్రోత్సాహ మివ్వవలెను. ప్రత్యేకంగా ట్రైనింగు కాలేజీలు తెరువవలెను.
16. టీచర్లకు హెచ్చుజీతము, అద్దెలేకుండా ఇల్లు, ప్రసూతికాలమందు భీమా మొదలగు సౌకర్యములు కలిగించి హెచ్చుమంది చదువు కున్న స్త్రీలు ఉపాధ్యాయవృత్తికి ఆకర్షింపబడునట్లు చేయవలెను.
17. గ్రామములోని వయోజనులైన స్త్రీలకు ప్రత్యేకవిద్యాసౌకర్యములు ప్రభుత్వం కలుగజేయవలెను.
18. చంటిబిడ్డల రక్షణ, వంటఇండ్లు, పుష్టికరమైన ఆహారము మొదలగు వాటిమీద ఉపన్యాసములను వయోజనులకు ఏర్పాటు చేయవలెను.
19. ప్రతిగ్రామంలోను ఒకగ్రంధాలయము, పఠనమందిరము వుండ వలెను.
20. పబ్లిక్ గ్రంధాలయములు, చిత్రకళలతోకూడిన మ్యూజియములు, జాతీయనాట్యమండలులు తెరచి ప్రజాసంస్కృతిని అభివృద్ధి పరచుటకు ప్రభుత్వం, స్థానికసంస్థలు సహాయపడవలెను.

## 3. ఆ రో గ్యం

ప్రతివ్యక్తియొక్క ఆరోగ్యం దేశంయొక్క సౌభాగ్యము, సంపత్తి. కాని యీదేశంలో బాలింతమరణాలు, శిశుమరణాలు ఎక్కువ. సగటుఆయువుతక్కువ. వీటివల్ల ప్రజలఆరోగ్యం క్షీణదశలోఉందని స్పష్ట మవుతూ వుంది. గనక యీ క్రిందివాటిని యీ మహాసభ సూచిస్తున్నది.

1. ప్రతివారికి ఉచితవైద్యసౌకర్యాలను ప్రభుత్వము కలిగించాలి.
2. ఉచిత ప్రసూతి - శిశుపోషణాలయాలను నిర్మించాలి.
3. రోగములు రాకుండా కాపాడుటకు అవసరమయిన పనులన్నీ (ఉ : శిశురక్షణాలయములు, బడిపిల్లలను పరీక్షచేయుట మొదలైనవి.) ప్రభుత్వము వెంటనే అమలుజరిపించాలి.
4. హెచ్చుమంది డాక్టర్లు, నర్సులు తయారగుటకు కావలసిన సదుపాయములను కలిగించవలెను.
5. నర్సింగు నేర్చుకొను స్త్రీలకు ఆ వృత్తి ఆకర్షణీయముగ నుండునట్లు తగిన వసతి, ఎక్కువ జీతం, నిర్ణీత పనిగంటలు, జీతంతో సెలవులు, భీమా మొదలగు సదుపాయములు కల్గించి మాతృభాషలోనే ట్రయినింగు యివ్వవలెను.
6. క్షయ, కాన్సరు, కుష్టు మొదలగు వ్యాధుల ప్రమాదమునుగురించి ప్రజలలో విరివిగా ప్రచారము చేయవలెను.
7. అంటువ్యాధుల ఆస్పత్రులను ప్రత్యేకముగా నిర్మించ వలెను.
8. మంచినీటి సప్లయి; మురుగు పారుదల విషయములలో గ్రామాల లోను, పట్టణాలలోను స్థానికాధి కారులు ప్రత్యేక శ్రద్ధ వహించవలెను.
9. చిన్న చిన్న యిండ్లలో ఎక్కువమంది నివసించుటను నిషేధించవలెను. పట్టణములలోను; పల్లెలలోను గృహ నిర్మాణమును బాగుచేసి ప్రత్యేక వంటగది, నీళ్ళగది తప్పని సరిగా వుండునట్లు చూడ వలెను. ప్రభుత్వం యిండ్లను నిర్మించి బీదవారికి అద్దెలకు యివ్వవలెను.
10. ప్రదర్శనాల, సినిమాల ద్వారా స్త్రీలు తమ వసతులను, పరిసరాలను శుభ్రంగాను అందంగా వుంచుకొనే పద్ధతులను ప్రచారంచేయాలి.

## 4. నైతిక స్థాయి

చిరకాల సాంఘిక, ఆర్థిక దుస్థితుల ఫలితంగా వ్యభిచార వృత్తి యేర్పడినది.

1. స్త్రీ పురుషులకు ఒకే నీతి నియమము యుండవలెను.

2. ఈ అవినీతికి గురియై చెడిపోయిన స్త్రీలను రక్షించుటకు శాస్త్రీయ పద్ధతులమీద ప్రత్యేక వసతి గృహములను నిర్మించవలెను.
3. స్త్రీలకు ప్రత్యేక వసతి గృహములు, హాస్టల్సు నడపుటకు తగిన నిబంధనలు చేయాలి. ఈ వసతి గృహాల ముసుగుతో ఎట్టి అవినీతి చర్యలు జరుగకుండా వుండుటకు తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.
4. ఈ పడుపువృత్తి నిషేధించుతూ చట్టం చేయాలి. దాని కవుసర మైన సాంఘిక, ఆర్థిక పరిస్థితులను అభివృద్ధి పరచవలెను.

## 5. పని

ప్రజాస్వామిక రాజ్యములో స్త్రీ పురుష భేదం లేకుండా వుద్యోగం చేయుట ప్రతివ్యక్తి యొక్క ప్రధానహక్కు. వ్యాపారంలోగాని పెద్ద అధికారంలోగాని ఇతర వుద్యోగాలలో గాని స్త్రీ అనే కారణంతో తక్కువగా చూడకూడదు. ఒకే పనికి పురుషునితో పాటు స్త్రీకి కూడ సమానమైన జీత మివ్వాలి. గనుక అఖిల భారత మహిళా మహాసభ యీక్రింది విధంగా కోరుతున్నది.

1. ఒకపనియొక్క నిబంధనలను అంగీకరించినపుడు ఆపని విచ్చుటలో వివాహిత, అవివాహిత అని, భేదంచూప గూడదు.
2. ఏ స్త్రీకికూడా స్త్రీ అనే కారణంచేత సాంఘికంగా కార్మిక హక్కులలో, బాధ్యతలలో సంపూర్ణ సమానత్వాన్ని నిరాకరించగూడదు. ఆరోగ్య వసతుల విషయంలో స్త్రీలకు, పురుషులకు సమాన వసతులు కలుగజేయాలి. గర్భిణీ స్త్రీలకు ప్రత్యేక వసతులు కలుగజేయాలి.
3. జీతము (జీవిత పరిమాణమునకు తగిన భృతి) పని గంటలు, సిక్ అలవెన్సు (జబ్బు చేసినపుడు ఇచ్చే ప్రత్యేక జీతము) జీతముతో సెలవులు, వుచితవైద్యం వీటన్నిటిలో పురుషులతోపాటు స్త్రీలకు సమాన సౌకర్యాలు కలుగచేయాలి. స్నానపు గదులు, మరుగుదొడ్లు, కాంటీన్లు మొదలైన వాటిలో సమాన సౌకర్యాలుండాలి. మరియు ఈ క్రిందివిషయాలలో స్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలుండవలెను.

(అ) పిల్లలకు ప్రత్యేక వసతి గృహములు (క్రెచీలు)
(ఆ) గర్భిణీ స్త్రీలకు ప్రత్యేక విశ్రాంతి గదులు.

(ఇ) పిల్లలకు, తల్లులకు పాలు సప్లయిచేయుటకు కాంటీనులు.

(ఈ) పని మధ్యకాలంలో గర్భిణీ స్త్రీలకు కొంత కాలం విశ్రాంతి.

(ఉ) సోషల్ ఇన్సూరెన్సు స్కీములో ఒక భాగంగా వైద్య సౌకర్యం కలుగజేయాలి.

## 6. గృహనిర్వహణ

రాత్రనక పగలనక సెలవుదినాలులేక ఎప్పుడూ కష్టపడి పనిచేసే గృహిణిని ఎవరూ గుర్తించుటలేదు ఆమెకు సౌకర్యాలు కలుగజేయుటకు ఏ విధమైన చర్యలు తీసుకొనలేదు సరిగదా వాటినిగూర్చి ఎవరికీ ఆలోచనేలేదు. గృహిణిచేసే పనికూడా అన్నిటిమాదిరే చాలా ముఖ్యమైనదని మేము విశ్వసిస్తున్నాము. అందువలన తల్లులైన గృహిణులైన వారి సౌకర్యార్థం ఆరోగ్యము కాపాడుకోడానికి, విజ్ఞానాభివృద్ధికి, వారి గౌరవ ప్రతిపత్తిని హెచ్చుచేయుటకు తగిన శ్రద్ధతీసుకోవాలి. కనుక యీ క్రింది కోర్కెలను కోరుతున్నాము.

1. భార్య యిష్టం లేకుండా భర్త తన ఆస్థినంతనూ అమ్మివేయడానికి ఎట్టి అధికారము వుండకూడదు.
2. ఇంటినిచక్కబెట్టే స్త్రీకి ఆమెభర్త సంపాదనలో(ఆదాయం)కొంత భాగాన్ని తన యిష్టంవచ్చిన రీతిగా ఖర్చుపెట్టుకొనే అధికారము ఉండవలెను.
3. బయట పొలాలలోను, ఫ్యాక్టరీలలోను పనిచేసే స్త్రీలకు, ఉపాధ్యాయులకు, నర్సులకు ప్రభుత్వం కలిగించే సోషల్ ఇన్సూరెన్సు సదుపాయములను ఇండ్లదగ్గరవుండే స్త్రీలకుకూడా కలిగించవలెను. భార్యకు ప్రత్యేక సంపాదన లేనియెడల భర్త యీఫండుకు చందావేయవలెను.
4. ప్రభుత్వంగాని, స్థానికసంస్థలుగాని క్రెచీలు, కిండరుగార్టెనులు (ప్రాథమిక పాఠశాలలో చేరకముందు విద్యగరిపే పాఠశాలలు) స్థాపించాలి
5. స్త్రీ తన ఇంటి నిర్వహణము నిర్మాణయుతమైన శాస్త్రీయపద్ధతులలో నేర్చుకొనుటకు వసతులు కలిగించాలి.

## 7. ఆస్తిహక్కులు

స్త్రీకి వారసత్వపు విషయంలోగాని, దానిని వశపరచుకొని తనదిగా చేసుకొనుటకుగాని, దానిని అమ్ముకొనుటకుగాని పురుషునితో సమానమైన హక్కు కలిగివుండాలి. వీనిలో కొన్ని స్త్రీలకు నిరాకరించబడినవి. ఒక వేళ యిచ్చినా చాల అసమానత్వం చూపబడుతోంది. కనుక యీ విధంగా కోరుచున్నది.

1. కొడుకులమధ్య, కూతుళ్ళమధ్య వారసత్వంలో ఏ విధమైన భేదం వుండకూడదు. తల్లిదండ్రుల ఆస్థికి వారిద్దరూ సమాన భాగస్వాములుగా వుండాలి.

## 8. వి వా హ ము

మనదేశములో వివాహచట్టాలు చాలపక్షపాతంతో చేయబడినవి. దానికారణంగా కొంతమంది స్త్రీల జీవితాలు దుర్భరపరిస్థితులకు లోనైనవని నమ్ముతూ ఆ చట్టాలను ప్రస్తుతపరిస్థితుల కనుకూలంగా నుండునట్లు యీ క్రింది విధంగా మార్చవలెనని కోరుతున్నది.

1. 16 సంవత్సరముల లోపు వయస్సుగల స్త్రీకి, 21 సంవత్సరముల లోపు పురుషునికి వివాహము చేయకూడదు.
2. వివాహకాలమునాటికి ఇద్దరిలో ఎవరికిని భర్తగాని, భార్యగాని జీవించి వుండకూడదు.
3. వధూవరుల అనుమతితోనే వివాహము జరుగవలెను.
4. జాతి, మత, కుల విభేదాలు వివాహానికి అడ్డురాకూడదు. వివాహానికి ముందు మతమును వదలివేయడానికి ఏవిధమైన ప్రకటన చేయనవసరం లేదు.
5. క్రౌర్యం, మూడు సంవత్సరములు విడిపోయివుండుట, చికిత్సకలవిగాని జబ్బులతో బాధపడుట మొదలగు కారణములుంటే ఇద్దరిలో ఎవరైనా వివాహాన్ని రద్దు చేసుకోవచ్చు.
6. విడాకులు యివ్వవలసి వచ్చినపుడు ఆకేసులను వాటికి సంబంధించిన ప్రత్యేక కోర్టులలో విచారణ చేయవలెను.

7. తిరిగి ఆమె వివాహము చేసుకొను వరకు విడాకు లిచ్చిన భర్త నుండి ఆమె పోషణకై ఖర్చును కోరవచ్చు.

8. వర కట్నమును ప్రభుత్వము చట్టముద్వారా విషేధించాలి.

## 9. గృహములో స్త్రీ స్థానము

కుటుంబం,పురుషుడు యజమానిగా వున్న ఒక సంస్థ అనీ, భర్త, భార్యా పిల్లలు తనస్వంత ఆస్థి అని అనుకొనే ఇప్పటివరకూప్రబలంగా వున్న తప్పుడు భావం, చాల పొరపాటని నమ్ముతున్నాము. ఈ తప్పుడు భావం వల్ల దెబ్బతినే చట్టాలను సవరించాలని, కుటుంబం, అందులోని ప్రతి సభ్యుడు,సభ్యురాలు సమాన హోదా కలిగిన సహకారసంస్థ అని నమ్ముతూ యీక్రింది విధంగా కోరుతున్నాము.

1. పురుషునితో సమానముగా స్త్రీ కూడ పిల్లలకు గార్డి యనుగా గుర్తించ బడాలి.

2. ఈహక్కును త్రోసిపుచ్చుటకు పురుషుని కధికార ముండకూడదు.

3. మైనారిటీ వెళ్ళని పిల్లల సంరక్షణ విషయంలో పిల్లల వయస్సు స్త్రీ పురుష భేదం తల్లిదండ్రుల ఆరోగ్యం, తదితర పరిస్థితుల నాలోచించి కోర్టు తీర్పు చెప్పవలెను.

4. భార్యగాని, భర్తగాని బ్రతికివుండగా రెండోవారి అనుమతి లేకుండా స్త్రీనిగాని, పురుషునిగాని దత్తత చేసుకొన కూడదు.

5. కాని న్యాయసూత్ర అనుమతితో దత్తత చేసుకోవచ్చు.

6. ఆర్థిక అనారోగ్య కారణాలవలన సంతతిని పరిమితిలో వుంచు కొనవలెనన్న భార్య కధికారముండవలెను. వివాహితులైన స్త్రీలం దరకూ రిజిష్టర్డు ఆస్పత్రుల ద్వారాను, ప్రసూతి ఆస్పత్రులద్వారాను మాత్రమే ఈవిషమైన పరిజ్ఞానాన్ని పొందుటకు అవకాశముండాలి.

## 10 బాధ్యతలు

పురుషునితోపాటు స్త్రీకూడా సమానహక్కులు కలిగి వుండాలి. సమాజంలో ఒకసభ్యురాలుగా, సమాజం యడల ఆమెకుకూడా సమాన బాధ్యతవున్నది. దేశం క్లిష్టపరిస్థితులకు లోనైనప్పుడు, అవుసరమని

పిలుపు విచ్చినప్పుడు స్త్రీలు, పురుషులు అందరూ తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి. దేశసేవ ( నర్సులు, వుపాధ్యాయినులు మొదలగు ) కార్యాలలో మహిళా సేవకురాండ్రు చాల తక్కువ కనుక అఖిలభారత మహిళా సభ దేశంలోని స్త్రీలకు యీవిధంగా పిలుపు నిస్తూవుంది.

1. ఇటువంటి ముఖ్యమైనటువంటి పనులు చేయుటకు పెద్దయెత్తున స్త్రీలు కదలి ముందుకు రావాలి.
2. దేశ క్లిష్టపరిస్థితులలో పనిచేయుటకు ముందుకు రావాలి.
3. వారంతటవారే మంచి పౌరులుగా తయారవ్వాలి.
4. దేశాభ్యున్నతిని నిరోధించే బాల్యవివాహాలు, పరదా, కుల, మత విభేదాలు, అంటరాని తనము మొదలగు సంఘదురాచారాలను మీ యంతట మీరేసంఘటిత పడి ఎదుర్కోవాలి.
5. తమ పిల్లలను భావిపౌరులుగా తయారు చేయాలి.
6. అన్ని జీవితరంగాలలో గొప్ప నైతిక ఔన్నత్యాన్ని నిర్మించి నిలబెట్టాలి.
7. దేశస్వాతంత్ర్యాన్ని, సుస్థిర ప్రపంచ శాంతిని సాధించాలి.

# ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ

ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ గుంటూరుజిల్లా చిలువూరు గ్రామములో జరుపుటకు వివిధజిల్లాల మహిళా సంఘాలు నిశ్చయించి నాయి. ఈ మహాసభ 1947వ సం॥ ఫిబ్రవరిలో 15-16వ తేదీలలో జరిగినది. దీనికి 7 జిల్లాలనుండి మహిళా ఉద్యమములో పని చేస్తున్నవారు ప్రతినిధులుగా వచ్చారు. వెనుకబడిన రాయలసీమ 4 గురు ప్రతినిధులను 14 మంది ప్రేక్షకులను మహాసభకు పంపినది. ఈ చివరనున్న విశాఖ జిల్లా 4గురు ప్రతినిధులను పంపినది. మహిళా వుద్యమము బాగాముందు కొచ్చిన కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలనుండి వందలకొలది ప్రతినిధులు వచ్చారు. మొత్తం 450 మంది ప్రతినిధులు, ప్రతినిధుల సమావేశంలో పాల్గొన్నారు.

ఈ మహాసభలో మొట్టమొదటి సారిగా అన్నివర్గాలకు చెందిన స్త్రీలు, పెద్దచిన్నాఅనే తారతమ్యంలేకుండా అందరు అతి వుత్సాహంతో తీర్మానాలన్నింటిమీద పోటీతో మాట్లాడారు. ప్రతిస్త్రీ తనకు తెలిసిన విషయము ఇతరులకు తెలియపరుద్దామని, తనకు తెలియని విషయాలను ఇతరులనుండి తెలుసుకొనుటకు చాలశ్రద్ధ చూపారు. ప్రతినిధుల సమావేశం జరిగిన రెండు రోజులు వందల కొలది పిల్లలు తమ తల్లులతో వచ్చినప్పటికి ఏమాత్రం శబ్దం వినపడలేదు. పిల్లలుకూడా జాగ్రత్తగా సమావేశంలో జరిగేచర్చలనుసానుభూతితో వింటున్నారా ? అనిపించింది. 16న సాయంత్రం నాలుగున్నర గంటలకు వూరేగింపు బయలుదేరినది. వూరేగింపుముందు హజ్రాబేగం, మిల్లీషోలింగర్, అచ్చమాంబగారలు నిలబడగా వారిననుసరించి 2 వేలమంది స్త్రీలు నిలబడ్డారు. జయజయధ్వానాలతో సాగిపోయినది. ఇన్నివేలమంది స్త్రీలు వుత్సాహ వినాదాలతో జెండాలు చేతబట్టి ముందుకు పోతుంటే చూచినప్రజలు "మహిళారథము కదలినది. ఇకవారి అభ్యుదయానికి అడ్డులేదు" అన్నారు.

6 గంటలకు వూరేగింపు ముగిసి సభ ప్రారంభమైనది. 10 వేల

ప్రజల నినాదాల, కరతాళ ధ్వనులమధ్య నాయకురాండ్రు వేదిక నలకరించారు. వచ్చిన ప్రజలలో స్త్రీలు 6 వేలమంది వున్నారు. షోలింగర్‌గారు జెండా ప్రతిష్ఠాపన చేశారు డాక్టరు లక్ష్మిగారు సభను ప్రారంభించారు. హజ్రాగారు ఇతర రాష్ట్రాలలోని మహిళావుద్యమాలను గురించి, బెంగాలు, బీహారు మొదలగు రాష్ట్రాలలో, మత కలహాలలో కలిగించు యీ అన్నదమ్ముల మధ్య తగాదాలలో సామరస్యం, ఐక్యత కుదర్చడానికి స్త్రీలు చేసిన కృషిని గురించి వివరించారు.

శిశుపోటీలలో విజయంగాంచిన పిల్లలను తల్లులను ప్రజలకు ఎరుకపరచిన తదుపరి బహుమతులివ్వ బడెను. తర్వాత ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘాధ్యక్షురాలగు డాక్టరు అచ్చమాంబగారు మాట్లాడారు. ప్రజలనెంతో వుత్సాహ పర్చారు. ఆహ్వాన సంఘాధ్యక్షు రాలగు మోటూరి వుదయంగారి అభివందనాలతో సభ ముగిసినది.

రాత్రి 10 గంటలనుండి ఒంటిగంటవరకు వైజ్ఞానిక కార్యక్రమము జరుపబడినది. దానికి 15 వేలమంది ప్రజలు హాజరయ్యారు, కృష్ణాజిల్లా మహిళాదళం వారి బుర్రకథ ప్రజల నుత్తేజ పరచినది.

## రాష్ట్ర మహిళా వుద్యమముమీద మహాసభ ప్రభావం

రాష్ట్ర మహిళా సభ జరిగేంతవరకు, వివిధ జిల్లాలలోని మహిళా సేవకురాండ్ర మధ్య సంబంధ బాంధవ్యాలు లేవు. దీనివల్ల ఒకరి అనుభవం ఒకరు తెలుసుకొనుటకు అవకాశములు లేకుండా పోయినవి. మొట్టమొదటిసారి ప్రతి మహిళా ప్రతినిధి ఇతర జిల్లాలలోని వుద్యమము యొక్క స్థాయి, దానిని విర్మించుటలో అక్కడి విజయాలు, లోపాలు తెలిసికో గలిగారు. ఇది రాష్ట్రమహిళా వుద్యమానికి గొప్పపునాది ఈ సభకు వచ్చిన ప్రతినిధు లందరికీ తమమీద తమకు గట్టి నమ్మకం, స్త్రీలు తమంతటతాము వుద్యమాన్ని ఏ స్థాయికైనా తీసుకు పోగలమని, పురుషుల లోను; స్త్రీలలోను వున్న సంకుచిత అభిప్రాయా లను పోగొట్టి, స్వతంత్ర వుద్యమాన్ని, మహిళాలోకాన్ని సమన్వయ పరచి ముందుకు నడుపగలం అనే ధైర్యం కల్గినది. అన్ని రాజకీయ పక్షాలకు చెందిన వారు యీ మహాసభతో మహిళా వుద్యమమంటే అదివరకు వారికున్న

అభిప్రాయాలు మార్చుకొని వుద్యమ అభివృద్ధికి తోడ్పాటు చేయాలనే వుద్దేశ్యములు కల్గినవి.

చిలువూరి సభనుండి తిరిగి వెళ్ళిన తర్వాత ప్రతి గ్రామ, తాలూకా జిల్లాలనుండి ఉత్సాహకరమైన రిపోర్టులు మహిళాసభలకు రమ్మనమని ఆహ్వానాలు రోజురోజుకూ రాష్ట్ర మహిళాసంఘం ఆఫీసుకు వస్తున్నవి. స్త్రీలందరిలోను ఒక క్రొత్త వెల్లువ, ఆత్మవిశ్వాసం స్పష్టంగా గోచరిస్తున్నది. ఈ నాడు ప్రతిచోటా మహిళాసంఘాలను నిర్మించి అభివృద్ధి చేయటానికి తమతోటి అన్నివర్గాల స్త్రీల కష్టాలు తమ స్వంత కష్టాలుగా భావించి వాటిని నిర్మూలించటానికి నడుముకట్టి ఎన్ని కష్టాలకైనా ఓర్చి సిద్ధపడుతున్నారు. జమీందారీ దౌర్జన్యాన్ని, పోలీసుల నిరంకుశత్వాన్ని ఎదుర్కొనుటలోగాని, మిల్లుయజమానులకు ఎదురుగానిలచి తమ హక్కుల కోసం ఐక్యతగా నిలబడుటలోగాని వెనుదీయుటలేదు. కొన్నిచోట్ల స్త్రీలు ముందంజవేయుటకూడ జరుగుతోంది. ఈ విధముగా తమశక్తిసామర్థ్యాలను చూపుతూ స్త్రీ జాతి గౌరవాన్ని ధీరత్వాన్ని చూపుతూ స్త్రీ అబల అనే భావాన్ని పటాపంచలు చేస్తున్నారు. స్థానిక మాహిళా సంఘాలన్నీ వారి హక్కులను బలపరుస్తూ అతివుత్సాహంతో పనిచేస్తున్నవి.

వచ్చే ద్వితీయ మహిళామహాసభనాటికి యీనాడు 25 వేల సభ్యత్వంగల సంఘాన్ని రెట్టింపుసభ్యత్వంతోను అన్ని జిల్లాలలోను నిర్మాణయుతంగా ఒక బలమైన సంస్థగా అభివృద్ధిచేయవలెనని, దీనిని దృష్టిలో పెట్టుకొని వివిధ జిల్లాలలోని మహిళా వర్కర్లందరూ కృషిచేస్తారని మేము ఆశిస్తున్నాము.



# రిపోర్టు

1937 లో మొదట కృష్ణాజిల్లాలో మహిళాఉద్యమము ప్రారంభమై దినదినాభివృద్ధి పొంది 7 జిల్లాలలో ఏర్పడ్డది. మహిళాఉద్యమం వందల కొద్ది గ్రామసంఘాలతో వేలకొలది సభ్యత్వంతో పనిచేస్తున్నది. అన్ని జిల్లాలలో ఉద్యమం ఒకేస్థాయిలో లేదు. కృష్ణా, గుంటూరు జిల్లాలలో చాలాబలమయిన ఉద్యమము ఏర్పడిఉన్నది. ప్రతిగ్రామ సంఘం ఆయా గ్రామంలోని దైనందిన సమస్యలను తీసుకొని నిర్మాణయుతంగా పని చేస్తున్నది.

## నిర్మాణం

100 గ్రామసంఘాలు నిర్మాణయుతంగా పనిచేస్తున్నవి. రాష్ట్రమొత్తం మీద 25000 సభ్యత్వం వున్నది. ఈనాడు 725 మంది స్థానికంగా పని చేసేటటువంటి ఉత్సాహవంతులైన వర్కర్లుగలరు. 6 జిల్లాలలో జిల్లాసంఘాలు ఏర్పడి పని చేస్తున్నవి.

## చేసిన పని

మొట్టమొదట్లో గ్రామాలకు వెళ్ళటము, ఇంటింటికి తిరిగి స్త్రీలను పిలచి మీటింగుపెట్టటం, వీలైనంతవరకు సభ్యత్వం చేర్పించటము, స్థానికంగాపనిచేసేస్త్రీలున్నట్లయితే గ్రామసంఘంఏర్పరచిపనిచేయించడం. జరుగుతూఉండే. నిర్మాణయుతంగా పనిచేస్తున్న మనసంఘాలు లైబ్రరీలు, ఆఫీసులు పెట్టుకొని దినపత్రికలు తెప్పించి రీడింగు గ్రూపులు జరిపేవి వీటిద్వారా స్త్రీలలో చైతన్యాన్ని కలుగచేస్తున్నవి. విజ్ఞానాభివృద్ధికొరకు పాటుపడుచున్నవి ఇవేగాక, పల్లెటూళ్ళలో స్త్రీలకు పాయఖానాసమస్య చాలా ముఖ్యం ఈ విషయంలో గ్రామ మహిళాసంఘాలు కొన్నిగ్రామాలలో తీవ్రకృషిచేసి జయప్రదం చేసినవి. పట్టణాలలో పంపుల దగ్గర యిబ్బందిపడుతున్నటువంటి నీటి సమస్యను పరిష్కరించినవి. తరువాత యుద్ధసమయములో జపాను ప్రమాదం ఎక్కువైనకొలదీ

మహిళాసంఘవర్కర్లు స్త్రీలలో జపాను ఫాసిస్టువ్యతిరేక ప్రచారాన్ని ఎక్కువగా చేశారు బాంబులప్రమాదాన్ని తప్పించుకొనే విధానాన్ని ప్రచారం చేయడం. కొంతమందితో ఎ. ఆర్. పి స్త్రీదళాన్ని తయారు చేయటం జరిగింది

సరియైన మహిళా ఉద్యమాన్ని నిర్మించి ముందుకు తోసుకు పోవాలంటే విజ్ఞాన వంతులైన మహిళా వర్కర్లు అవసరమయ్యారు. ఈ లోటునుతీర్చి ఉద్యమాన్ని పెంపొందించటానికి జిల్లా మహిళా సఘాలు అనేక మహిళావర్కర్ల క్యాంపులు నడిపి రాష్ట్రం మొత్తం మీద 8)0 మంది స్త్రీ వర్కర్లను తయారు చేశారు. వీరిలో చాలామంది వారి వారి ప్రాంతాలలో ఉద్యమాన్ని నడుపుచున్నారు. యీ క్యాంపులలో యీక్రింది విషయాలు నేర్పబడ్డవి. హిందూదేశ చరిత్ర, రాజకీయ భూగోళము, ఆరోగ్యం, ప్రసూతి - శిశుపోషణ పేపరు చదువుట, ఆత్మరక్షణ విధానము, పాటలు, మహిళా ఉద్యమనిర్మాణం, డిబేట్సు మొదలైనవి జరుగుతూ వుండేవి.

1942లో బ్రిటిషు సామ్రాజ్యవాదులు మన స్వాతంత్ర్యపోరాటాన్ని దెబ్బగొట్టదలచి కాంగ్రెసు నాయకు లందరినీ ఒక్కసారి జైళ్ళల్లో బంధించడంజరిగింది. సామాన్య పౌరసత్వహక్కుల్ని నాశంనచేసే యీబ్రిటిషు సామ్రాజ్యవాద దుర్మార్గాన్ని ప్రతిఘటించి నాయకుల విడుదలకోసం ఆందోళనచేశాం. విడుదల చేయవలసినదిగా మహజర్లమీద వేలకువేలు సంతకాలు చేయించి ప్రభుత్వాన్ని వత్తిడిచేశాం.

## కరువు

దేశమంతటా అనేక ప్రదేశాలలో కరువు వ్యాపించినది ఆకలి మంటలను భరించలేక స్త్రీలు తమ మానాన్ని అమ్ముకోవటముచూచి, పసిబిడ్డలు పండుటాకులవలె రాలిపోవుటచూచి, మన ఆంధ్రస్త్రీలు పూరుకొన జాలక పోయారు. వారి మాతృప్రేమను బెంగాలులోని ప్రజల కష్టాలు కలచి వేసినవి. ఇవన్నీచూస్తూ చేతులుముడుచుకొని కూర్చోలేకపోయారు. ఈఘోర పరిస్థితులకు ముఖ్యకారణం బ్లాకు మార్కెట్టువారులు, తిండి దొంగలు అని గ్రహించారు.

మహిళా సంఘాలు అన్ని రాజకీయ పార్టీలు కలిసి పనిచేస్తే గాని



చిలువూరు ఆంధ్రమహిళాసభ శిశుప్రదర్శనంలో
పాల్గొన్న
కొందఱు పిల్లలు, వారి తల్లులు



ఆహార సమస్యను పరిష్కరించ లేమని ప్రచారము చేసినవి. మన మహిళా వర్కర్లు కరువు నివారణకు విరాళాలు పోగు చేశారు. అ. భా. మ. సంఘం ఇచ్చిన పిలుపు ననుసరించి వందల కొలది గ్రామాలలో తిండి దొంగల చర్యలను ఖండించుతూ ఆహారవస్తువుల కంట్రోలు రేషనింగుల ఉపయోగముగూర్చి ప్రజలలో ప్రచారము చేయబడ్డది. రైతుస్త్రీలకు తమ భర్తలు ధాన్యాన్ని దొంగ వ్యాపారులకు అమ్మనీయ కుండా చూడడము తమ విధియని విజ్ఞప్తిచేశాము. గ్రామాల్లోని స్త్రీలలో ఆహారాన్ని వృధాగా పారవేయవద్దని ఎక్కువ పశువులను, కోళ్ళను, కూరగాయలను పెంచ వలసినదిగా ప్రచారము చేశాము. అనేకమంది ఉత్సాహ వంతులైన మహిళా వర్కర్లు విరామం లేకుండా బియ్యపు డిపోల దగ్గర వలంటీర్లుగా పనిచేశారు.

కస్తూరిబాయి నిధికి మన మహిళా వర్కర్లు కదలి ప్రజా సామాన్యంలో స్త్రీల వుపయోగార్థం డబ్బు వసూలు చేసి పంపారు.

ఎన్నికల సమయములో స్త్రీలందరిలో తమ పవిత్రమైన వోటింగ్ హక్కును నిరుపయోగం చేయకుండా శాసన సభలో స్త్రీల తరపున పని చేసే వారికి ఇవ్వవలసిన దని ప్రచారము చేశాము. మహిళా సంఘము యొక్క కృషిచేత స్త్రీలలో గొప్పకదలిక కల్గి మునుపు ఎప్పుడూ రానంత మంది ఎలక్షన్ బూత్సుకువచ్చి తమవోటునిచ్చారు. నేడు స్త్రీలకు నూటికి ఇద్దరిముగ్గురికి మాత్రమే ఓటింగు హక్కు ఉన్నది. దీనినిగుర్తించి తమ పవిత్రమైన వోటింగు హక్కును సద్వినియోగ పరచవలెనని ప్రచారము చేశాము.

1944 వ సంవత్సరములో బి. యన్. రావు చిత్తు చట్టానికి సవరణలు తయారుచేసి వెంటనేకేంద్రశాసన సభ చట్టంచేయాలని వేలకువేలు సంతకాలు చేయించాము. 1946 సం॥లో తిరిగి స్త్రీల హక్కులను బల పరుస్తూ స్త్రీలుపాల్గొన్న ప్రతి ప్రజాపోరాటాన్నిబలపరుస్తూ 36 బహిరంగ సభలను ఏర్పాటుచేసి 46 వేల మందిని సమీకరించాము. మూడు జిల్లా మహాసభలుకూడా జరుపబడినవి. ఈ మహాసభలలో వైజ్ఞానిక కార్యక్రమములో పాల్గొన్నవారు స్త్రీలూ పిల్లలే.

## ప్రజా ఉద్యమాలలో మన పాత్ర

ఇంతవరకూ సంఘంలోవిలోపాలను దిద్దటంలోను, దైనందినజీవిత సమస్యలను పరిష్కరించుటలోను మహిళాసంఘం కృషిచేసింది. ఇప్పు డిప్పుడే స్త్రీలు తమ తమ వర్గపోరాటాల్లోకూడా పనిచేయాలని మహిళా సంఘం వారిని బలపర్చాలని అర్ధంచేసుకొని పనిచేస్తున్నది. ఉదా :-

గుంటూరు పొగాకు సంబంధించి అమ్మే ముఖ్య కేంద్రం. ఈ పట్ట ణములో 10000 మంది కార్మికులు పుగాకు కంపెనీలో పనిచేస్తుంటారు. వీరిలో నూటికి 90 మంది స్త్రీలు. ఈ కార్మికులు ఉదయం 6 గంటల నుండి సాయంత్రం 6 గం॥లవరకు పనిచేసినా రు0-6-0 కంటె ఎక్కువ కూలి ఇవ్వరు. పైగా స్త్రీలను చాలహీనంగా చూస్తారు. ఏ స్త్రీయైనా తన యజమానియిష్టప్రకారంనడువకపోయినచో అందుకుశిక్షగా ఆమేకాకుండా ఆమె బంధువులందరూ పనులను పోగొట్టుకోవలసి వస్తున్నది. మన మహిళావర్కర్లు వీరిని తమ హక్కులకోసం నిలచి పోట్లాడమని వుద్బోధించారు. 10 వేలమంది సమ్మెచేశారు. యజమానులు ఈ కార్మి కుల ఐక్యతను భగ్నంచేయాలని ఎన్నో ప్రయత్నాలు చేశారు. స్త్రీ కార్మి కులు గట్టిగా నిలచి పికెటింగు చేశారు. కొంతమంది వక్తలుకూడ తయారయ్యారు. ఈ సందర్భంలో మన మహిళావర్కర్లు, విద్యార్థినులు వీరితోపాటు శ్రమకోర్చి జైళ్ళకు వెళ్ళారు. ఈ ఘటనలో మొత్తం 65 మంది స్త్రీలకు శిక్షపడింది. అయితే చివరకు రోజుకు రూపాయికూలి, గౌరవప్రదమైన జీవితము సంపాదించుకున్నారు. ఇపుడు తమ కార్మిక సంఘాన్ని పెట్టుకున్నారు. మహిళాసంఘం తమకుచేసిన వుపకారాన్ని మరచిపోక స్త్రీ సంఘాలలో సభ్యులుగాజేరి సంఘాన్ని బలపరుస్తున్నారు.

ఈ ప్రకారంగా మునిసిపల్ వర్కర్సు మరి ఇతర కార్మికులు వారి ఇబ్బందులు తీర్చుకోవడానికి తప్పనిసరియై సమ్మెచేసినప్పుడు వాటిలో పాల్గొన్న స్త్రీలను వుద్యమాలను అన్ని విధాల బలపర్చింది.

## రైతు స్త్రీలు

రైతు స్త్రీలు ముఖ్యంగా జమీందారీ ప్రాంతంలో అక్కడి అక్ర మాలను తమ ప్రాణాలొడ్డి ఎదుర్కొంటున్న తమ పురుషులతోపాటు అన్ని ఇక్కట్టులకు అన్ని త్యాగాలకు ధైర్యంతో సిద్ధమవుతున్నారు.

ప్రతిచోటా మహిళా సంఘాలు వీరిని బలపరచుతున్నాయి. ఉదా:- పశ్చిమ గోదావరి కలవలపల్లిలో జమీందారుకు రైతులకు జరిగిన ఘర్షణలో మొట్టమొదట రౌడీల, పోలీసుల దౌర్జన్యాలకు భయపడి జంకారు. కొద్దిమంది స్త్రీలు తమ పురుషులను వెనుకకు లాగుటకూడ జరిగింది. మన మహిళా వర్కర్లు ఈ స్త్రీలకు ఆ పరిస్థితులు వివరంగా తెలియజెప్పి తమ పురుషులతోపాటు ముందుకు నడచేటట్లు చేశారు. ఈ విధంగా కృష్ణాలో గాజుల్లంక; గుంటూరుజిల్లా కల్లూరులలో జరిగింది.

విద్యార్థులు, విద్యార్థినులు అతిఘోరమైన డిటెన్షనుకు వ్యతిరేకంగా నిలచినపుడు పోలీసు దౌర్జన్యాలకు, విద్యాధికారుల దౌర్జన్యాలకు గురి అయ్యారు. మహిళాసంఘాలు విద్యార్థినుల న్యాయమైన కోర్కెలను తీర్చమని ప్రచారం చేసినవి.

## సంఘంలోని వివిధవర్గాల స్త్రీలు

మహిళా సభ్యురాంద్రలో ఎక్కువమంది రైతుస్త్రీలు వున్నారు. కార్మిక, వ్యవసాయకూలీ స్త్రీలు ఇపుడిపుడే వస్తున్నారు. పట్టణాలలోని మధ్యతరగతి స్త్రీలనుకూడా వుద్యమంలోకి ఇపుడిపుడే తీసుకువస్తున్నాం. భాగ్యవంతులుగాని, బీదవారుగాని సమానంగానే, సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా వెనుకబడియున్నామనే సంగతి అందరూ తెలుసుకుంటున్నారు.

## మేధావులు

ఏ 10 12 మంది మాత్రమే ఉద్యమంలో పనిచేస్తున్నారు. ఇక ముందు కాలేజీలలో చదువుకుంటున్న విద్యార్థినుల మహిళాసంఘాలతో సంబంధం పెట్టుకొని ఉత్సాహంతో పనిచేయాలని కోరుతున్నాం.

మహిళాసంఘంలో అన్నిరాజకీయ అభిప్రాయాలు కలిగిన స్త్రీలకు తావున్నది. మహిళాసంఘం స్త్రీలందరి హక్కులకోసం సమాన స్థానం కొసం, దేశ స్వాతంత్ర్యంకోసం పనిచేస్తూన్నది. ఈ ఆశయాలను వ్యతిరేకించే స్త్రీలు వుండరు. మహిళావర్కర్లు హక్కుల మహజర్ల మీద సంతకాలు చేయించేటపుడుగాని, సభ్యత్వం చేర్పించేటపుడుగాని, విరాళాలకోసం వెళ్ళేటపుడుగాని జాతి, మత, రాజకీయ విచక్షణలేకుండా ప్రతియింటికి పోయి పనిచేస్తున్నారు. రాజకీయవిభేదాలతోటి, కక్షలతోటి

చీలిపోయిన కొన్ని గ్రామాలలోసైతం మహిళాసంఘం తన ఎడతెగని కృషిఫలితంగా ప్రజలందరిని కలిపి వారిమధ్య సామరస్యం కుదర్చ గలిగింది.

## వైజ్ఞానిక రంగం

ప్రతి మహిళాసంఘ సభలోను వైజ్ఞానిక కార్యక్రమంలో స్త్రీలు, పిల్లలు ఉత్సాహంగా పాల్గొంటున్నారు. బుర్రకథదళాలు, పాటలదళాలు, మరిఅనేకదళాలు తయారవుతున్నాయి. ఈ సందర్భంలోముఖ్యంగా రాధ, రాజమ్మ, సరోజనీలతో కూడిన బుర్రకథ దళం ముఖ్యంగా పేర్కొన దగినది. వీరి దళం కళానైపుణ్యంలోనేమి, సంగీతమాధుర్యంలోనేమి, సాంఘిక, రాజకీయ విషయాలు ప్రజలకు ప్రబోధించుటలోనేమి ఆంధ్ర రాష్ట్రంలో ప్రసిద్ధి వహించింది. ఆంధ్రరాష్ట్రంలో మారుమూలలమండీ ప్రజలు జాతి, మత, రాజకీయవిభేదాలు మరచి ఈ మహిళా దళాన్ని ఆహ్వానిస్తున్నారు. వీరి దేశసేవ, మహిళాసేవకు అభివందనాలు.

## మహిళాసంఘాల భావికార్యక్రమం

1. స్త్రీలు తమ ప్రత్యేకమైన హక్కులకేగాకుండా తమతమ వర్గసంఘాలలోచేరి పనిచేయాలి.

2. స్త్రీల ప్రత్యేకహక్కుల బిల్లులను శాసనసభలలో ప్యాసు చేసేటట్లుగా రాష్ట్రప్రభుత్వంమీద వత్తిడితేవాలి.

## సంఘంలో స్త్రీల మార్పు

మొట్టమొదట్లో మహిళావర్కర్లు గ్రామాల్లో పని మొదలు పెట్టి నప్పుడు పరిస్థితులు చాలాకష్టంగా ఉండేవి. స్త్రీలు పురుషులు అందరూ మహిళా సంఘానికి వ్యతిరేకమే. అనేకమంది అనేక విధాలుగా మాట్లాడు తుండేవారు, అనేకచోట్ల మీటింగు పెట్టుటకు స్థలం దొరికేదికాదు. ప్రతి వూరికి ఉమ్మడిగా ఉండే గుడిలో పెట్టుకుందామంటే గుడి నిర్వాహకులు కొంతమంది కొన్నిచోట్ల వ్యతిరేకించేవారు. ఒక గ్రామములో మొదట ఆవరణలో పెట్టుకొనుటకు అంగీకరించినా గుడి నిర్వాహకులు తీరా సమయానికి వీలులేదు అని నిరాకరించారు. నడివీధిలో మీటింగు జరుపుట జరిగింది. స్త్రీలు బయటికి వచ్చేవారుకారు. తమ యింటి కిటికీలలోనుండి సందులలోనుండి గోడలమీదనుండి తొంగిచూస్తూ ఉండేవారు. పిల్లలు

ఎక్కువమంది మీటింగు స్థలంలో కూర్చొనుట జరిగేది. స్త్రీలు దూరం దూరంగా ఉండే విచిత్రంగా చూచేవారు. సభ్యత్వం చేర్పించుటకు వెళ్ళితే "అణా కావలిస్తే తీసుకెళ్ళండి సంతకాలు చేయం; మామగవారు కోప్పడతార"నేవారు. మామహిళా వర్కర్లు వారికి ప్రత్యేక సమస్యలు (ఆరోగ్యం, శిశుపోషణ, మరుగు దొడ్ల సౌకర్యం, ఆస్తి హక్కులు మొదలైన వాటిని) తీసుకొని పనిచేసి నప్పుడు మహిళాసంఘ విలువను గుర్తించారు. మహిళాసంఘాలభివృద్ధి కాజొచ్చినాయి. ఈనాడు మహిళా కార్యక్రమంగాని మహిళా మీటింగులేగాక ఏరాజకీయ సాంఘిక విషయాలకు సంబంధించిన అభ్యుదయ కరమైన మీటింగు లన్నిటికి వేలకు వేలు తమ చంటిపిల్లలతో సహితం వచ్చిపాల్గొంటున్నారు. విషయాలను ఆసక్తితో గ్రహించుకున్నారు. వూరేగింపులలో పాల్గొనుటకు స్త్రీలు పురుషులతోబాటు విరివిగా ముందుకొస్తున్నారు. ఎటుచూచినా స్త్రీలలో సర్వతోముఖమైన చైతన్యం వెల్లి విరుస్తోంది.



# అ. భా. మహిళా మహాసభతో మన సంబంధబాంధవ్యాలు

అనేక జిల్లాలలో మహిళా వుద్యమం అభివృద్ధి పొందింది. ఈ వుద్యమాన్నంతా కేంద్రీకరించి ఇంకాముందుకు తీసుకు పోవడానికి రాష్ట్ర సంఘం అవుసర మయింది. ఇదివరకే రాష్ట్రంలో అఖిలభారత మహిళా సభ యొక్క రాష్ట్ర శాఖ వున్నది. దీనిద్వారా ఆంధ్రదేశ మహిళా వుద్యమాన్ని బలపర్చుదా మనుకున్నాం. కాని క్రింద వుదహరించ బోయే కారణాల వలన అది విఫలమైనది. వేరుమార్గంలేక మహిళాసంఘ అభ్యుదయాన్ని, దేశ స్వాతంత్ర్యాన్ని కోరి యీనాడు ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘాన్ని స్థాపించాం. ఇటీవల చిలువూరు మహాసభ తర్వాత అఖిల భారత మహిళాసభలో పనిచేస్తున్న వెంకట రత్నమాంబగారు, పార్వతమ్మ గారు మేము పోటీ రాష్ట్ర సంఘాన్ని పెట్టి మహిళా వుద్యమాన్ని విచ్ఛిన్నం చేస్తున్నామని ఏమేమో వ్రాశారు. దీనివల్ల మాకు అ. భా. మ. సభ ఆంధ్ర శాఖకు ఈరెండు సం॥ల నుండి వున్న సంబంధములను వివరించుచున్నాము.

రెండేండ్లక్రితం వరకు అ॥ భా॥ మ॥ స॥ ఆంధ్రరాష్ట్రంలో నామ మాత్రంగానే ఉండిపోయింది. ప్రతిసంవత్సరము అ॥ భా॥ మ॥కాన్ఫరెన్సు జరిగినపుడు ఆంధ్రదేశ ప్రతినిధిగా ఎవరినో ఒకరిని (స్టాండింగ్‌కమిటీ మెంబరు)నియమిస్తూవచ్చారు. సంవత్సరానికొకసారికొద్ది ందిస్త్రీలుతమంతట తాముగాని, ఆంధ్రరాష్ట్ర స్టాడింగు కమిటీ మెంబరుచేత ఆహ్వానింపబడిగాని, అఖిలభారతమహిళాకాన్ఫరెన్సుకు ప్రతినిధులుగా వెళ్లుతుండేవారు. కొన్ని ఆంధ్రరాష్ట్ర మహిళా సభలు జరిగినవి. 1941 డిసెంబరులో కాకినాడలో అ॥ భా॥ మ॥ కాన్ఫరెన్సు జరిగింది. దీని తర్వాత అ॥ భా॥ మ॥ సభయొక్క ఆంధ్రశాఖ అసలే పనిచేయకుండాపోయింది. రెండు సం॥ల క్రితం కామేశ్వరమ్మగారి సలహాతో అ॥ భా॥ మ॥ సభ వారు శ్రీమతి కొండా పార్వతమ్మగారిని ఆంధ్రరాష్ట్రం తరపున స్టాడింగుకమిటీ మెంబ

రుగా నియమించారు. కాకినాడ కాన్ఫరెన్సులో ఆంధ్రశాఖ పనికి కమిటీని ఏర్పరచారు. దీనిలో మానికొండ సూర్యావతిని ఒక మెంబరుగా తీసుకొన్నారు. అప్పటి స్టాండింగుకమిటీ మెంబరైన జాస్తి సీతామహాలక్ష్మమ్మ గారు కృష్ణా, పశ్చిమ గోదావరి మహిళా సంఘాలను అ॥ భా॥ మ॥ సభ యొక్క ఆంధ్రశాఖకు రుసుం తీసుకుని అనుబంధశాఖగాచేశారు. పార్వతమ్మగారని స్టాండింగుకమిటీ మెంబరుగా నియమించిన తరువాత రాష్ట్ర మహాసభను ఏర్పాటుచేశారు. దీనికి తన యిష్టం వచ్చినవారికి ఆహ్వానాలు పంపారు. సభసంగతి పేపర్లలోచూచి కృష్ణాజిల్లా మహిళాసంఘం పార్వతమ్మగారిని అ॥ భా॥ మ॥ ఆంధ్రశాఖకు అనుబంధ శాఖయైన మాకు ఆహ్వానం ఎందుకు పంపలేదు? ఏ రీతిగా ప్రతినిధులను పంపాలి? అని అడిగారు. దానికి పార్వతమ్మగారు ఇంతకుముందువున్న అ॥భా॥మ॥ సభయొక్క రికార్డు అంతాపోయింది, కాబట్టి మాకేమీ తెలియదన్నారు. మొదటినుండీ ఆంధ్రలో అ॥ భా॥ మ॥ సభ పనిని శ్రద్ధగాచేస్తున్నట్టిన్ని, రాష్ట్రసంఘ అధ్యక్షురాలును అయిన కామేశ్వరమ్మగారితో యీ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాం. ఆమె "నేను సభకు వస్తున్నాను. మీ ప్రతినిధులను పంపండి అక్కడే అన్నివిషయాలు మాట్లాడుదాము" అన్నారు. 1944 నవంబరు 11, 12, తేదీలలో గుంటూరులో రాష్ట్రసభ జరిగింది. అన్ని జిల్లాలనుండి మన మహిళాసంఘ ప్రతినిధులు యితర మహిళాసంఘవర్కర్లు దానికి హాజరయ్యారు. మొదటినుండి పార్వతమ్మగారు మన మహిళాసంఘ వర్కర్లమీద విముఖత చూపించారు. మన సంఘములో పనిచేసే వర్కర్లను ప్రతినిధులుగా తీసుకొనుటకు నిరాకరించారు. పాఠకులు ఒక సంగతి గుర్తించాలి. అప్పటివరకూ కృష్ణా, పశ్చిమ గోదావరిజిల్లా సంఘాలుతప్ప అ॥భా॥మ॥సభ ఆంధ్రశాఖ గుర్తించిన అనుబంధశాఖలు వేరేలేవు. అక్కడికి వచ్చిన ప్రతినిధులందరూ తమంతట తామే వ్యక్తిగతంగా వచ్చినవారే, కామేశ్వరమ్మగారు అంతకుపూర్వం జరిపిన మహిళాసభల ఆనవాయితీ ప్రకారం సభకువచ్చిన వారందరినీ ప్రతినిధులుగా తీసుకోవలెనని వాదించారు. నిబంధనావళి ప్రకారంగా చూసినా అనుబంధశాఖలయొక్క ప్రతినిధులను తప్పనిసరిగా తీసుకోవలసి వచ్చింది. ఈ కారణాలవలన కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లా సంఘాల ప్రతినిధులను తీసుకొన్నారు.

మహాసభ జరిగిన రెండురోజులు వీలైనంతవరకు రిపోర్టులివ్వడానికి అవకాశమివ్వకుండా ఈ రెండుజిల్లాల ప్రతినిధుల యెడ చాల సంకుచితంగా ప్రవర్తించారు. రెండోరోజు సాయంత్రం పార్వతమ్మగారు ఆంధ్రరాష్ట్ర మహిళా తాత్కాలిక ఆర్గనైజింగు కమిటీని వేశారు. కమిటీమెంబర్ల పేర్లు చదివి కమిటీ ఏర్పడిందన్నారు. ఇందులో సూచించిన కొంతమంది మహిళాసంఘాలతోగాని, సంస్థలతోగాని, సంబంధం లేనివారున్నారు. ఇంతపెద్ద మహిళా వుద్యమం నిర్మించిన కృష్ణాజిల్లా మహిళాసంఘంనుంచి ప్రతినిధిని ఎందుకు తీసుకొనలేదు అని అడిగాం. దానికి జవాబులేదు. అక్కడ సందేహాలకు సమాధానం చెప్పేవారే కనబడలేదు. ఆ సభకు అధ్యక్షత వహించిన కమలాదేవిగారు కూడ తనకేమి తెలియదన్నారు. సభానంతరం కృష్ణాజిల్లా మహిళాసంఘం ఈ సంగతంతా అ.భా. మహాసభవారికి తెలిపింది. ఇక సభ్యత్వం చేర్పించడం దగ్గరకు వచ్చేసరికి పార్వతమ్మగారు, ఆమె అనుయాయులు ఈజిల్లా వర్కర్లెన్నిసార్లు వెళ్ళి అడిగిననూ ఒక్కసభ్యత్వ ఫారమైనా అందనీయలేదు. దీనినిగూర్చి అ. భా. మహాసభ కార్యదర్శినియైన కుల్సుం సయానీగారికి తెలిపాము. అక్కడనుండి వర్కింగుకమిటీకి, మాకూ అనేక ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినవి కృష్ణాజిల్లా మహిళాసంఘాన్ని అనుబంధశాఖగాగుర్తించమని కార్యదర్శినియైన కుల్సుంసయానీకి వ్రాశాం. దానిమీదట 1945 మే 9 వ తేదీన సూరత్‌లో జరిగిన స్టాండింగు కమిటీసమావేశంలో ఈ విషయమంతా సమగ్రంగా చర్చించి జూన్ 15 వ తేదీనాటికి తప్పక తీసుకొనవలసిందని తీర్మానించారు. ఈ తీర్మానం కృ మహిళాసంఘానికి, పార్వతమ్మగారికీ అందజేశారు. అప్పటికీ పార్వతమ్మగారు దృఢనిశ్చయంతో అనుబంధశాఖగా గుర్తించుటకు నిరాకరించారు. కుల్సుం సయానిగారు ఈ విషయంలో పార్వతమ్మగారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపడం, వార్నింగులు ఇవ్వడంగూడజరిగింది. అ.భా.మ, కాన్ఫరెన్సు తేదీ దగ్గరకొచ్చింది. సభ్యత్వం చేర్పించే గడువుకూడ దాటిపోవచ్చింది. ఒక్కసభ్యత్వఫారంకూడ మాకివ్వలేదు. దీనిమీదట కుల్సుం సయానీ స్వంతంగా ఫారములు వేయించి సభ్యత్వం చేర్పించమని వ్రాసింది. దీనిననుసరించి కృ. మ. సంఘం అనుబంధశాఖగా సభ్యత్వఫారాలు వేయించి ఒకనెలరోజులలోనే 2500 ల సభ్యత్వం చేర్పించింది. డిశంబరులో

కాన్ఫరెన్సు ముందు జరిగిన స్టాండింగుకమిటీలో కమలాదేవిగారు మరల కృ. మ. సంఘాన్ని అనుబంధశాఖగా గుర్తించటమా ? లేక గుర్తించక పోవడమా ? అనే సమస్య లేవదీసి చివరకు అ. భా. మ. సంఘనిబంధనలలో మార్పు తీసుకొచ్చారు. దీనిప్రకారం ఒకప్రాంతంలో ఒక్క సంఘం మాత్రం అనుబంధశాఖగా గుర్తించాలి అని మార్పుచేశారు. అంతకు కొద్దినెలలకు పూర్వమే పార్వతమ్మగారు కృష్ణాజిల్లాలో ఒక నామమాత్రపు శాఖను ఏర్పాటుచేశారు. దీనిని అనుబంధశాఖగా గుర్తించి కృష్ణాజిల్లా మహిళాసంఘం చేర్పించిన 2500 సభ్యత్వాన్ని మాత్రం గుర్తించుశామని తీర్మానించారు. ఈ తీర్మానంవల్ల ఫలితాలేమిటి ? తా ్కాలికంగా ఆ సంవత్సరము ఈ రెండువేల అయిదువందల సభ్యత్వం గుర్తించడం జరుగుతుంది. గాని అప్పటికి 8 సం. లనుండి పనిచేస్తున్న సంఘాన్ని రద్దుచేయడం జరుగుతుంది. దీని ఫలితంగా పైనవివరించిన మాదిరిగా సభ్యత్వఫారముల దగ్గరనుండి అన్నివిషయాలలోను తగాదాలు. ఇదిగాక ఈవాదవివాదముల మూలంగా ఈసం॥రం నుండి మహిళాసంఘం పని కుంటుపడినట్లుగా ఇకముందుకూడా మహిళావుద్యమం దెబ్బతింటుంది. ఇవన్నీ ఆలోచించి ఇంతవరకూ అ. భా. మ. సభ ఆంధ్ర శాఖతోకలిసి పనిచేయుటకు చేసిన అన్నిప్రయత్నాలు విఫలమైనందున స్వతంత్రంగా ఉండే పనిచేయుటకు నిశ్చయించింది.

అన్ని జిల్లాలలోను మహిళావుద్యమం ఏర్పడి పని చేస్తున్నందునను, అ. భా. మ. సభ ఆంధ్రశాఖతో కలసి పని చేయుటకు ఆటంకాలు పెట్టినందునను కేంద్రీకరించి పనిచేయుట వుద్యమ వ్యాప్తికి అవుసరంగాన వివిధ జిల్లాలలోని మహిళా వర్కర్లు ఆలోచించి ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘాన్ని ఏర్పరచడం జరిగింది. ఇప్పటికి అ. భా. మ, సభ కార్యక్రమాన్ని శ్రద్ధతో తెలిసికొని ఆచరణలో పెడుతున్నది. ఇకముందు పెడుతుంది. ఈనాటికికూడ రాష్ట్రమహిళాసంఘం అ. భా. మ. సభతో కలిసి పనిచేయుటకు సంసిద్ధంగానే వుంది.



# తీర్మానాలు

## సానుభూతి తీర్మానం

భారత దేశమునకు వన్నెతెచ్చిన బులాభాయిదేశాయ్, రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి, పండిత మదనమోహన మాలవ్యాగార్ల మరణములకు యీ సభవారు చింతించుచున్నారు. వారి కుటుంబాలకు సానుభూతిని తెలియజేయుచున్నాము.

## అభివందనాల తీర్మానం

సంయుక్త జాతి సమితికి హిందూదేశమునుండి పంపిన రాయబార వర్గమునకు నాయకురాలుగా శ్రీమతి విజయలక్ష్మి పండిట్‌గారిని నియమించినందుకు ఈసభవారు గర్వించుచున్నారు. హిందూదేశపు రాయబార వర్గం ముఖ్యంగా విజయలక్ష్మిపండిట్‌గారు దక్షిణాఫ్రికాలోని భారతీయుల తరపున వాదించి గెలుపొందినందుకు వారికి మా అభివందనాలు తెలియచేయుచున్నాము. భారతదేశముయొక్క న్యాయమైన హక్కులను బలపరచిన అన్నిదేశములవారికి మా నమస్కృతులు అందచేయుచున్నాము. సంయుక్త జాతి సమితిలో స్త్రీలకు, పురుషులతోపాటు సమాన హక్కులు ఉండాలని, ఈ విషయాన్ని అంతర్జాతీయ సమస్యగా అంగీకరించినందుకు ఈ సభవారు అభివందనాలు తెలిజేయుచున్నారు.

## స్త్రీలకు పురుషులతోపాటు సమాన వారసత్వహక్కులను కలిగించాలి

తర తరాలనుండి హిందూ న్యాయశాస్త్రంలో స్త్రీలకు పిత్రార్జితమైన ఆస్తిమీదగాని, మరి ఏ యితర ఆస్తిమీదగాని, పురుషులతోపాటు, ఏవిధమైన హక్కు గల్గించ బడలేదు. ఈ న్యాయశాస్త్రం బహు పక్షపాత బుద్ధితో పురుషులకు అనుకూలంగా వ్రాయబడినది.

ఈనాడు ప్రతిదేశంలోను సంఘాలలోనూ స్త్రీలు పురుషులు సమానమైన వ్యక్తులన్న సూత్రాన్ని ఆమోదించినా, మన న్యాయశాస్త్రం స్త్రీలకు ఆస్తిలో హక్కు కల్గించపోవటం చాలా శోచనీయం. కాబట్టి ప్రభుత్వములో నున్న కాంగ్రెసు మంత్రులు తమ కర్తవ్యాన్ని గుర్తించి స్త్రీలకు పిత్రార్జిత ఆస్తిలో వారసత్వంగా సంక్రమించే మరి ఏ యితర ఆస్తిలోను పురుషులతోపాటు స్త్రీలకు సమాన హక్కులు కల్పించే చట్టాన్ని వెంటనే తీసుకు రావలసినదిగా యీ సభవారు కోరుతున్నారు.

## దేశముఖ్ యాక్టును వ్యవసాయభూములకు వర్తింపజేయాలి

1937కి పూర్వం విభక్త కుటుంబంలో మరణించిన పురుషుని ఆస్తి అతని వితంతు భార్య అనుభవించ టానికి వీలుగా వుండేది. కాని అవిభక్త కుటుంబంలో ఒక పురుషుడు చచ్చిపోయి నట్లయితే, అతని భార్యకు కొద్ది మనోవర్తి తప్ప ఎంతగొప్ప ఆస్తి వున్నా భర్త భాగానికి ఆమె హక్కుదారురాలు గాదు.

1937 సం. లో దేశముఖ్ కేంద్ర శాసన సభలో అవిభక్తకుటుంబంలోని వితంతువుకి, భర్త ఆస్తిమీద హక్కు వుండాలని ఒక చట్టాన్ని తెచ్చారు. ఆ చట్టాన్ని కేంద్ర శాసనసభ ఆమోదించింది. అనాధ స్త్రీలకు ఇంత వుపయోగమైన చట్టం ఆచరణలోకి వచ్చే టప్పటికి, కొన్ని అడ్డంకులు కన్పడ్డాయి. వ్యవసాయ భూములకు సంబంధించిన మార్పులు, చట్టాలు చేసే అధికారం రాష్ట్ర ప్రభుత్వాలది. మళ్ళా రాష్ట్ర ప్రభుత్వాలు గూడా తమ శాసన సభలద్వారా కేంద్ర శాసనసభ చేసిన ఈ చట్టాన్ని ఆమోదించకపోతే ఇల్లు, డబ్బు మొదలగు చరాస్తులమీద హక్కు కల్గుతుందే గాని, వ్యవసాయ భూములమీద హక్కు ఏర్పడదు.

మన దేశంలో ప్రధానంగా భూమియే ముఖ్యమైన ఆస్తి కాబట్టి మన రాష్ట్రంలోగూడ ఇట్టి చట్టాన్ని చేయ వలసినదిగా చాలా కాలం నుండీ మన సంఘం ఆందోళన చేస్తున్నది. ఎట్టకేలకు శాసన సభలో చట్టంచేయుటకు, చేసినందుకు శాసనసభా సభ్యురాండ్రకు అభివందనాలు. కొంతమంది అభివృద్ధి విరోధకులు 1937 సం. నుండి దీనిని వర్తింప చేయుటకు అడ్డు పెట్టున్నా, శాసన సభా స్త్రీ సభ్యురాండ్రు గట్టిగా విలబడు

తున్నందుకు మా అభివందనాలు. యిప్పటికే ఆలస్యమై స్త్రీలకు అన్యాయం జరిగింది. దీనిని వెంటనే శాసన సభా సభ్యులందరూ, ఏకగ్రీవంగా ఏ అడ్డు పెట్టకుండా ప్యాసు చెయ్యాలని ఈ సభవారు కోరుతున్నారు.

## 16 సంవత్సరముల లోపువారికి వివాహం నిషేధించాలి

హిందూ న్యాయశాస్త్ర ప్రకారం 14 సం. లు పూర్తియైననేగాని వివాహము చేయకూడదు. ఒక వేళ 14సం. ముల లోపల వివాహము జరిగిన ఎవరైనా గార్డియనును కోర్టుకులాగితే పేరుకుమాత్రం శిక్ష పడ వచ్చును కాని వివాహమురద్దుకాదు. 18 సంవత్సరములవరకు తన యిష్టం వచ్చిన వానిని గార్డియను అనుమతిలేనిదే వివాహమాడుటకుగాని ఇష్టము లేని సంబంధమును నిరాకరించుటకుగాని వీలులేదు.

ఇది చాల అసందర్భంగాను అనేక చిక్కులకు ప్రమాదాలకు దారితీయునదిగాను వున్నది. పదిహేను పదునారేండ్ల వయిస్సుగల బాలిక ఒకపురుషుని వరించి పెండ్లిచేసుకొనవలెనంటే ఆమె తల్లిదండ్రులుగాని గార్డియనుగాని ఇందుకు వ్యతిరేకించినయెడల వివాహము చేసుకొనుటకు వీలులేదు.

1. ఆమె పదునెనిమిది సం.లు నిండువరకు యీ సంబంధమును మాన్పుటకు తమవాళ్ళుచేసే నిర్బంధాలకు గురియై యింక యెవ రినీ చేసుకొనకుండా గడుపవలసి వస్తుంది.
2. లేదా తాను నిర్ణయించుకున్న పురుషునితో వెళ్ళిపోయి పదునెని మిది సం. లు నిండిన తదుపరే న్యాయసమ్మతమైన వివాహమును చేసుకొనవలసి వస్తుంది.

కాబట్టి 14,18 సంవత్సరముల వయస్సుకు బదులు 16 సం.లు వచ్చిన స్త్రీకి తన యిష్టమైన పురుషుని వివాహమాడే హక్కు కలిగించవలయుననీ. 16 సం.ల వయస్సులోపల వివాహము నిషేధించవలయుననీ యీ సభవారు ప్రభుత్వాన్ని కోరుతున్నారు.

## బహుభార్యాత్వం నిషేధించాలి-విడాకులహక్కు బలపరచాలి

హిందూ న్యాయశాస్త్రంలోని వివాహాలకు సంబంధించిన చట్టాలు స్త్రీలకు చాలా అన్యాయంచేస్తున్నవి. పురుషులు ఒకేసమయంలో, ఎందరి భార్యలనైనా వివాహం చేసుకొని కాపురం చేయవచ్చు.

గొప్ప సంస్కృతికలిగి, ముందుకు పోతున్న ప్రతిదేశంలోను, ప్రతి సంఘములోను ఎక్కడగూడా న్యాయసమ్మతముగా ఒక భర్త ఒక భార్యకంటే ఎక్కువమందిని చేసుకోవటమనేది అనాగరికత, గర్హ్యనీయ మైయున్నది. దీనివలన ముఖ్యంగా స్త్రీలకు బాధలు కల్గటం చూస్తూ వున్నాం. ఇట్టి సంసారాలలోలి స్త్రీలు పురుషులు కూడా ఏవిధమైన సౌఖ్యం పొందటానికి అవకాశాలు వుండవు. కాబట్టి బహుభార్యాత్వాన్ని విషేధిస్తూ రాష్ట్రప్రభుత్వం చట్టం తీసుకొస్తున్నందుకు ఈసభవారు అభి వందనాలు తెలియ చేస్తున్నారు.

## పడుపువృత్తి నిషేధించాలి; బీదప్రజలకు జీవనోపాధి నేర్పరచాలి

మనము హిందూసంఘాన్ని మతాన్ని, గొప్పగాప్రశంసిస్తున్నాము. ప్రశంసకుతగినట్లుగా సంఘాన్ని దిద్దుటకూ, మార్చుటకూ మాత్రం చిన్నవేలను కూడా కదల్చము. మన సంఘములో ఈ ఇరువదవ శతాబ్ద ములో కూడా పడుపువృత్తులలో జీవించటం విరాఘాటంగా జరిగిపోతూ ఉన్నదంటే మనమందరమూ తలవంచుకోవలసిన విషయము.

ఈ పడుపువృత్తిలో జీవించే స్త్రీలందరూ మన అక్కచెల్లెండ్రు, వీరిని మనము సంస్కరించి, మనతోపాటు గౌరవనీయులైన పౌరులుగా ఎంచబడేటట్లుచేయుట ప్రతిస్త్రీయొక్క విధి.

దీనిని వెంటనే రూపుమాపేటట్లు చేయాలి. లేకపోతే మనజాతి సంస్కృతిగల జాతులలో ఒకటిగా ఎన్నుకోబడుటకు అర్హతఉండదు.

వెంటనే రాష్ట్రప్రభుత్వం దేవదాసీవృత్తినీ, పడుపువృత్తినీ విషే ధించి వీరికి గౌరవప్రదమైన వృత్తులు కల్పించే చట్టాన్ని తీసుకురావలసి నదిగా ఈ సభవారు కోరుతున్నారు.

## ఉద్యోగాలివ్వడంలో స్త్రీ పురుషులకు సమానత్వం వుండాలి

స్త్రీ పురుషులు సమానం అని అందరూ ఒప్పుకున్న విషయమే. పురుషులతోపాటు సమానంగా చదువుకొని ఏ ప్రభుత్వోద్యోగమైనా చేయ డానికి సంసిద్ధంగానున్న స్త్రీలు అనేకులు మనదేశంలో వున్నారు. ఇలాం టపుడు తగిన సామర్థ్యం వున్నప్పటికీ స్త్రీలైనంతమాత్రంచేత ఈ ఉద్యో

గాలకు అర్హతలేదు అని ఈనాడుకూడ విచక్షణచూపడం. ప్రపంచంలో జరుగుతున్న మార్పును, సంస్కృతిని అర్థంచేసుకోకపోవడమే అవుతుంది. కాబట్టి స్త్రీ పురుషులకు అర్హత వున్నపుడు ప్రభుత్వం ఉద్యోగాలివ్వడంలో విచక్షణచూపకూడదు అని ఈ సభవారు కోరుతున్నారు.

## విద్య

మన దేశంలో 100కి 13 గ్గురుకంటె ఎక్కువ చదువను, వ్రాయను తెలిసినవారు లేరు. వారిలో నూటికి ఇద్దరు మాత్రమే స్త్రీలు. ఈ పరిస్థితులలో మన దేశం బాగుపడాలంటే వయోజన విద్యమీద అందరం దృష్టిని కేంద్రీకరించవలసివుంటుంది. ప్రతి గ్రామ మహిళాసంఘం ఈ క్రింది సూచనల ప్రకారం పనిచేయవలసింది అని రాష్ట్ర మహిళాసంఘము కోరుతున్నది.

ఎ. ప్రతి గ్రామ మహిళాసంఘము తప్పక ఒక లైబ్రరీని కలిగి వుండవలెను.

బి. దినపత్రికను తెప్పించవలెను. ఆదాయమునుబట్టి దినపత్రికలను, వార, మాస పత్రికలను తెప్పించవలెను.

సి. గ్రామములోని స్త్రీ లందరికీ చదువనూ, వ్రాయనూ నేర్పుట గ్రామ మహిళాసంఘంయొక్క ముఖ్యవిధి.

డి. విద్య అభివృద్ధికావాలంటే సరిగా శిక్షణపొందిన వుపాధ్యాయినులు చాల అవసరం. ఎక్కువమంది వుపాధ్యాయినులను తయారు చేయడానికి సరియైన స్కూళ్లు, విద్యాసంస్థలు వాటిలో చదువుకొనే వారికి స్కాలరుషిప్పులు ఇచ్చి ప్రభుత్వము పోషించవలెను. ఇదియేగాక టీచర్లయొక్క వేతనములు, ఉద్యోగమునకు సంబంధించిన పెన్షన్లు వగైరా సౌకర్యాలను ఎక్కువ చేయవలయునని ప్రభుత్వాన్ని ఈ సభవారు కోరుచున్నారు.

ఇ. ప్రతిమానవుడు మంచి ఆరోగ్యం కలిగివుండాలంటే ఆహారం ఎంత అవసరమో మనస్సుకనుక పూర్తిగా వికసించాలంటే విద్య అంతేఅవసరం. వెంటనే నిర్బంధ ప్రాథమికవిద్యను అమలుపర్చాలని విద్యాశాఖమంత్రిని యీ సభవారు కోరుతున్నారు.

## ఆరోగ్యవిధులు

ఈ రాష్ట్రంలోని తల్లుల యొక్కయు, బిడ్డల యొక్కయు ఆరోగ్యం ఏ మాత్రమూ శ్రద్ధ తీసుకొనక పోవుటవలన నానాటికీ క్షీణ దశకు వచ్చింది. బీదతనం చేతనూ, ప్రభుత్వం ఏమీ సహాయపడక పోవుట చేతనూ, శిశువుల మాతల మరణసంఖ్య మన దేశంలో అత్యధికం. ప్రసూతి సమయంలో తల్లుల మరణసంఖ్య ప్రతి సంవత్సరం ఎక్కువౌతున్నది.

మన రాష్ట్రంలోని ప్రజలు బలము కలవారుగానూ, దేశానికి సంఘానికి వుపయోగపడే వారుగానూ వుండాలంటేనూ, మన పిల్లలను అనారోగ్యము నుండి మృత్యు ముఖమునుండి రక్షించవలసి వున్నది. ప్రతి స్త్రీకి గర్భవతిగా నున్న సమయంలో జాగ్రత్త, ప్రసూతి సమయమందు శాస్త్రరీత్యా తరిఫీదు పొందిన మంత్రసాని అవుసరమైతే డాక్టరు సహాయమూ వుండునట్లు చూడవలెను. ప్రసూతి సమయమందు సహాయము చేయుపని ఏమీ తెలియని నాటు మంత్రసాని చేతిలో పెట్టుట మానాలి. మనము మన రాష్ట్ర ప్రభుత్వాన్ని యీ క్రింది సదుపాయము లన్నియూ వెంటనే మన స్త్రీలకు ఏర్పాటుచేయ వలసినదిగా కోరుతున్నాం.

ఇవన్నీ నెరవేర్చుకొనుటకు ప్రభుత్వం మీద వత్తిడి తీసుకురావలెనని స్త్రీ లందరినీ హెచ్చరిస్తున్నాం.

### 1. ప్రసూతి సౌకర్యములు

(అ) ప్రతి 5 వేల జనాభాకు ఒక పల్లెటూరి డిస్పెన్సరీ వుండవలెను. ఏ ఒక పల్లెటూరి జనాభాయైనా ఇంతకంటే తక్కువగా వున్నట్లయితే చుట్టుపట్ల 2 మైళ్ళలోనున్న గ్రామాలను కలుపుకోవచ్చును. ఈ డిస్పెన్సరీకి అనుబంధంగా 5 మంచములు కల్గిన చిన్న ప్రసూతి వైద్యశాల వుండవలెను.

ప్రతి 2 వేల జనాభాకు శాస్త్రరీత్యా చదువుకొన్న మంత్రసాని వుండవలెను.

(అ) ఆ తాలూకా కేంద్ర హాస్పిటల్‌లో 15 ప్రసూతి మంచములు కల్గినటువంటి ప్రసూతి వైద్యశాల యిద్దరు డాక్టర్లూ వుండ వలెను.

వీరిలో ఒకరు చుట్టుపట్ల గ్రామాలకు వెళ్ళి స్త్రీలకు సలహా లిచ్చు చుండ వలెను.

(ఇ) జిల్లాకేంద్ర ఆసుపత్రి ఆధునిక సౌకర్యములతోనూ పనిముట్లతోనూ, ఎప్పటికప్పుడు సిద్ధముగా నున్న ఒక మంచి ప్రసూతి శాలను కలిగివుండ వలెను.

(ఈ) అంబ్యులెన్సు సర్వీసు ప్రతి పల్లెటూరిలోకి అందు బాటులో సిద్ధముగా వుంచవలెను.

(ఉ) ప్రతి ఆసుపత్రి కొన్ని మంచాలను ప్రత్యేకంగా బిడ్డలకు వేరుగా వుంచవలెను.

(ఊ) నిర్మాణ యుక్తంగా ప్రసూతి విషయాలు పిల్లల జాగ్రత్త తీసుకొను విషయాలు ప్రజలకు ముఖ్యంగా స్త్రీలలో ప్రచారం జరిగేటట్లు చూడవలెను.

2. పాయఖానాల యిబ్బంది పట్టణముల కంటే పల్లెటూరి వారికి ఎక్కువగా అర్థ మౌతుంది. పల్లెటూళ్ళలో యిండ్లదగ్గర పాయఖానా లుండే పద్ధతిలేదు. స్త్రీలుగాని, పురుషులుగాని బయళ్ళనే పాయఖానాలుగా వుపయోగిస్తారు. ఈ పద్ధతి వలన ఆరోగ్యం పోగొట్టుకొనేది స్త్రీలు. పగలు వెళ్ళుటకు ఎక్కడా మరుగు దొడ్ల సౌకర్యం లేనందున వెళ్ళుటకు వీలులేక మలబద్ధకం వ్యాపిస్తుంది. దీనివల్ల ఆకలి మందగించుట రక్త క్షీణత ప్రవేశిస్తుంది. యింతే గాదు. గర్భిణీ స్త్రీలకు యీ మలబద్ధకం చాల ప్రమాదం. ఇది ఒక్కొక్కపుడు గుర్రపు వాతానికి కూడా దారితీయవచ్చు కాబట్టి దీనిని ఒక ముఖ్య సమస్యగా తీసుకొని మహిళా సంఘాలు ఆందోళనచేసి ప్రభుత్వంద్వారాస్థానిక సంస్థలద్వారా ప్రజలసహకారంతో పరిష్కరించ వలెను.

ప్రతిపట్టణములోను, పల్లెటూరిలోను తగినంతశుభ్రమైన మంచి నీరు త్రాగుటకు అందరికీ అందునట్లు ఏర్పాటు చేయవలయును.

## పార్కులు - ఆటస్థలాలు

స్త్రీలు ఇంటిపనులలోను, పిల్లల జాగ్రత్తలోను యింటిలోనే చాలా కాలంగడుప వలసివస్తుంది. గాన వారికి, పిల్లలకు తీరిక సమయంలో

ప్రశాంతంగా గాలి పీల్చుటకు, పిల్లలు ఆడుకొనుటకు ప్రతిపట్టణంలోను, పల్లెటూరిలోను, పార్కులు, ఆటస్థలములు ఏర్పరచవలెను.

## అస్పృశ్యతను నిర్మూలించాలి

అంటరాని తనము, మనసంఘానికి గొప్ప అవమానకరమైన పద్ధతి. తర తరాలనుండి మనదేశముయొక్క ఉన్నతిని, సంస్కృతిని, కలుషితం చేస్తున్నది. వెంటనే మద్రాసు ప్రభుత్వం అంటరాని తనాన్ని అన్నివిధాలా నిర్మూలించి ఆర్థిక విజ్ఞానసౌకర్యాలను కలుగచేసే చట్టాన్ని ప్యాసుచేయ్యాలి. స్త్రీలందరూ ఆచరణలో అంటరానితనాన్ని నిర్మూలించ టానికి కృషిచెయ్యాలని ఈసభవారు కోరుతున్నారు.

## మత సామరస్యం

అన్ని మతాలకు, అన్ని జాతులకు చెందిన ఆంధ్రదేశ స్త్రీలమైన మేము బెంగాల్, బీహారు మరి తదితరప్రాంతములలోని హిందూ-ముస్లిం మతకలహాల్లో జరిగిన అమానుషమైన మన దేశస్థుల యొక్క చర్యలను వినుటకు దిగ్భ్రమ చెంది అవమాన పడుచున్నాం. ఈ క్రూరకృత్యములకు గురియైనవారికి మా సానుభూతి తెల్పుతూ మన దేశముయొక్క స్వాతంత్ర్య అభ్యుదయాలకు పునాదియైన మతసామరస్యానికి శాయశక్తులా పాటుబడుటకు శపథము తీసుకొను చున్నాము. మేము మా కర్తవ్యాన్ని నిర్వహించుతాము. దేశంలోని అన్ని రాజకీయపార్టీల నాయకులను మతసామరస్యంకొరకు వారి కర్తవ్యాలను నెరవేర్చవలసినదిగా కోరుచున్నాం.

స్త్రీలంతా నిస్సహాయత చూపక ఆత్మరక్షణా విధానాన్ని అభ్యసించి దుండగీడులను ఎదుర్కొని, తమ్ముతాము రక్షించుకొనుటకు సిద్ధపడాలని ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

## స్త్రీకార్మికుల కనీసకోర్కెల తీర్మానం

ఈ సభవారు ప్రభుత్వాన్ని పరిశ్రమలలో పనిచేస్తున్న స్త్రీ కూలీలకును తక్కువ జీతాలు కలిగిన వృత్తులలో పనిచేస్తున్న స్త్రీలకును ఈ కింది సౌకర్యాలను కల్గించుటకై చట్టము తేవలెనని కోరుతున్నారు,

1. స్త్రీలకు పురుషులతోపాటు సమానమైన కూలి ఇప్పించాలి. ఎట్టి పరిస్థితులలోను వీరి జీతాలు రు 45 లకు తగ్గకుండా వుండవలెను. 4
2. స్త్రీల ఆరోగ్యానికి భంగకరమైన పనులలో స్త్రీలను నియమించరాదు (ఉ॥ బొగ్గుగనులు మొ॥)
3. రోజుకు 8 గంటలు. వారానికి 40గం॥లకుమించిపని చేయించరాదు

## జమీందారీవిధానం రద్దుచేయాలి

మనరాష్ట్రంలో రైతుకుటుంబాలయొక్క బీదతనమునకును దేశంలోని కరువునకును జమీందారీవిధానమే ముఖ్యకారణము. కాబట్టి రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వాలు జమీందారీ విధానాన్ని రద్దుచేయవలెనని ఉద్దేశించి నందుకు మా అభివందనాలు.

ఇపుడు ప్రకాశంగారు జమీందారీవిధానాన్ని నష్టపరిహారాన్నిచ్చి ఎప్పుడో రద్దుచేయాలని 1802 నాటి శిస్తులు జమీన్‌రైతులు యిచ్చుకోవాలనే తీర్మానాన్ని శాసన సభలో ప్రవేశపెట్టబోతున్నారు ఇది ప్యాసు చేయడమంటే జమీందారీలు రద్దుచేసే సమస్య కాలపరిమితి లేకుండా వాయిదా వేయడమే అవుతుంది. దీనివలన రైతులకు మేలుకలుగకపోగా జమీందారులకు అనేకహక్కు లేర్పడుతున్నవి

గాన యీ సభవారు రాష్ట్రప్రభుత్వాన్ని ఎట్టి నష్టపరిహారం యివ్వకుండా జమీందారీవిధానాన్ని వెంటనే రద్దుచేయవలసినదిగా కోరుచున్నాం.

## టెక్స్టైల్ పాలసీ

గత 6 సం.నుండి అనగా యుద్ధము లగాయతూ బట్టల కరువు రోజురోజుకూ తీవ్రమైనది. మిల్లుబట్ట దొంగమార్కెట్టులో తప్ప దొరుకుటలేదు. చేనేత బట్టలమీద కంట్రోలు లేకపోవుటవలన వాటిధర 5, 6 రెట్లు పెరిగిపోయింది. ఇందువలన రైతులు, కూలీలు, కార్మికులు, పట్టణ మధ్యతరగతి ప్రజలు నానాటికీ అవస్థలుపడుచున్నారు.

అనేకమంది బీదప్రజలు రంగు రంగు ముక్కలను అతుకువేసుకొని ధరించటము మనము రోజూ చూస్తున్నాము ఇదేగాదు, వేలకొలది బీదస్త్రీలు తమ ఒడలు కప్పుకోవడానికి మూరెడుగుడ్డ దొరకక పోవుటవలన ఇండ్లలోనుండి బయటకు రాలేకపోవుచున్నారు.

ఇలాంటిపరిస్థితులలో గుడ్డనుఎక్కువగాఉత్పత్తిచేసి ప్రజాఅవుసరాలనుతీర్చటానికిబదులు ఇటీవలన మనరాష్ట్రమంత్రివర్గం పిడుగువంటి వార్త ప్రకటించింది. ఖాదీ స్కీమును అమలుజరుపటానికి 3 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టదలచినట్లుగా ఇప్పుడున్న మిల్లులు పెంపొందించటంగాని నూతన మిల్లులు ప్రవేశపెట్టుటగాని జరుగదని ప్రకటించినారు. మన రాష్ట్రమునకు నిర్ణయించిన కదుళ్ళ కోటాను తీసుకోవటము వదలుకొన్నారు మిల్లులను తీసివేసి ఖాదీ పరిశ్రమమీదే ఆధారపడాలని సాలుకి మనిషికి 6 గజాల బట్టను నిర్ణయించారు. దీనివలన బట్టల కరువు తీరకపోగా ముఖ్యంగా స్త్రీలు చాలా బాధపడవలసి వస్తున్నది.

మన రాష్ట్రంలో అసలేపరిశ్రమలు తక్కువ. ఇపుడున్న మిల్లులు ఉత్పత్తిచేసే గుడ్డ మనరాష్ట్రప్రజావుసరాలకు చాలదు. ఇంతేగాదు, ఖాదీ ప్లానువల్ల మనరాష్ట్ర ప్రజల అవుసరాలు తీరకపోగా మనరాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడిపోతుంది. ప్రత్తిని ఉత్పత్తిచేసే మన రైతులు తమ ప్రత్తిని చౌకగా అమ్ముకొని ఇతర ప్రాంతాలలో మిల్లుమీద తయారయ్యే బట్టలను ఎక్కువధరలకు కొనుక్కోవలసి వస్తుంది. మనరాష్ట్ర ప్రజలు, ఇతరులదోపిడీకి గురియైపోతారు. మన స్త్రీ పురుషులందరికీ ఇది ఉద్యోగాలకు, జీవనానికి పరిశ్రమాభివృద్ధికి ఆటంకం.

మన రాష్ట్రమంత్రివర్గం ప్రజాందోళనమూ, ప్రజా అవుసరాలను గుర్తించి తమ ఖాదీస్కీమును వదలుకొని నూతన బట్టల మిల్లులను, నూలుమిల్లులను, విరివిగా స్థాపించి ప్రజలకు చక్కటి జీవన సదుపాయాలు కలుగ చేయాలని ఈ సభవారు కోరుచున్నారు.

## నూతన ఆర్డినెన్సును రద్దుచెయ్యాలి-పౌరసత్వహక్కులను కాపాడాలి

నిరంకుశ బ్రిటీషు సామ్రాజ్యవాదుల నుండి స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యము పౌరసత్వహక్కుల సాధనకై జాతీయ సంస్థపేరిట మహోజ్వలమైన పోరాటాలు జరిగినాయి.

పౌరసత్వ హక్కులసాధనకై మనం అనేకత్యాగాలు చేశాం. అట్టి పౌరసత్వహక్కులను తనప్రభుత్వంలో కాపాడుతానని, పెంపొందించు

తానని కాంగ్రెసు తనఎన్నికలప్రణాళికలో ప్రకటించింది. అందుచేత నేమన ప్రజాసామాన్యం కాంగ్రెసుని అధికారంలోకి పంపింది.

కాంగ్రెసుప్రభుత్వం అధికారంలోకి వచ్చినదిగదాయని నిరంకుశ జమిందారీ, పెట్టుబడిదారీ వర్గంనుండివిముక్తిపుందవికార్మికులు, రైతులు, స్త్రీలు ఆనందించారు. తమన్యాయమైన హక్కులకొరకు రైతుకార్మిక స్త్రీ పురుషులు పోరాటాలు సాగిస్తున్నారు. ఈ పోరాటాలు కేవలం పొట్ట కొరకు సాగించేవేగాక స్వాతంత్ర్య పోరాటంలో భాగంగూడ. వీటిని బలపర్చుటవల్ల సామ్రాజ్య వాదం బలహీన పడుటయే. ప్రజా ఉద్యమము బలపడుట అంటే ప్రజా మంత్రివర్గం బలపడుటయే.

కాని ఈ పోరాటాలను దురదృష్ట వశాత్తు కాంగ్రెసు మంత్రివర్గం వ్యతిరేక దృక్పథంతో చూస్తుంది. కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలోకి వచ్చినతఈకొద్దినెలలో ఏనెలలో చూచినా అరెస్టులు, లాఠీచార్జీలు, కాల్పులు ఇక 144, 107 సెక్షన్ల విషయం చెప్పనవుసరమేలేదు. ఈ నిర్బంధ విధానంవల్ల స్త్రీ పురుష కార్మిక రైతు ప్రజా సామాన్యం అందరి పౌరసత్వ హక్కులు నాశన మౌతున్నాయి అనేకమంది కాల్పులకు గురియై మరణించటం, జైళ్ళలో త్రోయబడటంజరిగింది. ఇప్పటిచర్యలు ప్రజామంత్రి వర్గాల కాలంలో జరుగుట విచారించవలసిన విషయం. దీనివల్ల ఎవరు బలపడుచున్నారు? ఎవరు బలహీన పడుచున్నారు? ప్రజా మంత్రివర్గం ఎంతత్వరగా గ్రహించితే అంతమంచిది.

ఈ పెట్టుబడిదారులు, జమీందారులు మన స్వాతంత్ర్య ఉద్యమములో ఏ నాడూ కలసిరాలేదు పైగా వ్యతిరేకులు, సామ్రాజ్యవాదుల బంట్లుగూడ. అట్టివారికి వ్యతిరేకంగా జరిగే పోరాటాలను బలపరచుట ద్వారా సామ్రాజ్యవాదుల నాశనం, మన స్వాతంత్ర్యపోరాటం బలపటడం జరుగుతాయి. అట్లుగాక, ఇప్పటివలె నిర్బంధవిధానం ప్రయోగించి పౌరసత్వహక్కులను భంగపరచి, లాఠీచార్జీలు, కాల్పులు సాగించుట వలన జమీందారులు, సామ్రాజ్యవాదులు బలపడతారు.

కనుక పై నగ్నసత్యాన్ని గమనించి, కాంగ్రెసు మంత్రివర్గం ప్రజామంత్రివర్గంగా ప్రవర్తించాలనీ తమ ఎన్నికల వాగ్దానాలను పాటించుటద్వారా పౌరసత్వహక్కులను కాపాడి ప్రజాపోరాటాలను బలపరిచి

సామ్రాజ్యవ్యతిరేక పోరాటానికి దోహదం యివ్వాలి. ప్రతివ్యక్తీ, తమకు యిష్టమైన రాజకీయాభిప్రాయం కలిగియుండే హక్కులను గుర్తించాలి. అన్ని పౌరసత్వహక్కులకు ప్రజాస్వామ్య సూత్రాలకు గొడ్డలిపెట్టు వంటిదైన ఈ నూతన అమానుష ఆర్డినెన్సును వెంటనే రద్దుచెయ్యాలి. రాజకీయ ఖైదీలందరినీ విడుదలచెయ్యాలి. పోలీసు, మిలటరీ అత్యాచారాలకు గురియైన అన్ని ప్రదేశాలలోను విచారణ జరుపవలెనని మద్రాసు ప్రభుత్వాన్ని ఈ సభవారు కోరుచున్నారు.

## రా జ కీ య తీ ర్మా న ం

ఈనాడు మనదేశంలోని ఐక్యతను నాశనం చేసే హిందూ ముస్లిం కలహాలకు కారణం, బ్రిటీషు సామ్రాజ్యవాదం మనమీద రుద్దనున్నప్లానే. దేశాన్ని అనేక భాగాలుగా విభజించి ఒకరితో ఒకరు కలవకుండా, మధ్యవర్తిత్వం చేస్తున్నది బ్రిటీషు ప్రభుత్వం. ఒకసారి కాంగ్రెసును, ఒకసారి లీగును అనుకూలించినట్లుగా నాటకమాడి కాంగ్రెసు ప్రజలకు లీగు ప్రజలకు ఒకరిమీద ఒకరికి అనుమానాలను పెంపొందిస్తున్నారు. కాంగ్రెసు లీగులు యీ ద్వేషంతో తమ ఇద్దరి బానిసత్వానికి కారణమైన ప్రబల శత్రువులైన బ్రిటీషు సామ్రాజ్యవాదాన్నే మర్చిపోతున్నారు.

బ్రిటీషు సామ్రాజ్యవాదుల యీ మోసాన్ని భగ్నంచేసి వయోజన ఓటింగు మీద బ్రిటీషు ఇండియాలోను స్వదేశ స్థానాలలోను ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధులతో కూడిన రాజ్యాంగనిర్ణయ సభను, తాత్కాలిక ప్రభుత్వం ఏర్పరచాలని, ఈ సభవారు కాంగ్రెసు లీగు నాయకులను కోరుతున్నారు.



# కార్యనిర్వాహక వర్గం

అధ్యక్షురాలు : డాక్టరు కొమఱ్ఱాజు అచ్చమాంబగారు, L.R.C.P

ఉపాధ్యక్షురాలు : డాక్టరు లక్ష్మి, M, B, B. S.

కార్యదర్శిని : మానికొండ సూర్యావతిగారు

సహాయకార్యదర్శినులు : చంద్ర సావిత్రీదేవిగారు,
మోటూరి ఉదయంగారు

వర్కింగుకమిటీ సభ్యురాండ్రు :
వెల్లంకి అన్నపూర్ణాదేవిగారు
తాపీ రాజమ్మగారు
కొమఱ్ఱాజు పద్మావతిగారు
నాగళ్ళ రాజేశ్వరమ్మగారు
ఎ. పద్మావతమ్మగారు
పరుచూరి సూర్యాంబగారు
అన్నే అనసూయగారు
గోకరాజు వెంకాయమ్మగారు
పందిరి జగదాంబగారు
ఇనుగంటి రామతులశమ్మగారు
దిగుమర్తి సువర్ణాబాయిగారు
మోటూరి శేషారత్నంగారు
టి. సావిత్రిగారు

ఇంకా 8 మందిని కోఆప్టు చేసుకోడానికి యీ కమిటీకి అధికార మివ్వడమైనది.

## ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళామహాసభ జమలు

| | |
|---|---|
| గుంటూరుజిల్లా చందా | 1911- 0-0 |
| కృష్ణాజిల్లా .. | 1259- 1-3 |
| పశ్చిమగోదావరిజిల్లా చందా | 50- 0-0 |
| తూర్పుగోదావరిజిల్లా .. | 150- 0-0 |
| నెల్లూరుజిల్లా .. | 77-13-0 |
| విశాఖజిల్లా .. | 83- 8-0 |
| మిగిలిన వస్తువులమ్మగా వచ్చింది | 292- 6-0 |
| ప్రతినిధుల రుసుం | 357- 0-0 |
| భోజనాలక్రింద | 11- 8-0 |
| మొత్తం జమ | 4192- 4-3 |
| మొత్తం ఖర్చు | 2490- 6-0 |
| నిల్వ | 1701-14-3 |

## ఆర్గనైజింగు కమిటీకి వివిధజిల్లాలిచ్చిన చందాలు వాటి జమా ఖర్చులు

| | |
|---|---|
| కృష్ణాజిల్లా | 300- 0-0 |
| గుంటూరుజిల్లా | 150- 0-0 |
| పశ్చిమగోదావరిజిల్లా | 50- 0-0 |
| మొత్తం | 500- 0-0 |
| ఖర్చు | 71-13-0 |
| నిల్వ | 428- 3-0 |
| మహాసభలో మిగిలినది | 1701-14-3 |
| ఆర్గనైజింగుకమిటీ నిల్వ | 428- 3-0 |
| మొత్తం నిల్వ | 2130 -1-3 |

## ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ ఖర్చులు

| | |
|---|---|
| ప్రయాణపు ఖర్చులు | 230- 4-0 |
| గేటు నిర్మాణానికి | 579- 0-6 |
| సభా ఏర్పాట్లు | 509-11-0 |
| భోజనానికి | 462- 2-3 |
| అనామతు | 109- 0-0 |
| కల్చరల్ | 179-12-0 |
| ప్రింటింగు | 181- 8-0 |
| బహుమతులు | 102- 7-6 |
| జెండాలు | 90- 9-3 |
| పోస్టేజి | 23- 1-0 |
| హాజరాతో ఫోనులో మాట్లాడినందుకు | 8- 6-0 |
| స్టేషనరీ | 11- 8-6 |
| స్టాంపులు | 3- 0-0 |
| మొత్తం ఖర్చు | 2490- 6-0 |



ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ.—కె. 13/సి. 2000 కాపీలు—26-5-47



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B141 |
| పుస్తకం పేరు | ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | HPOO |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | Good |